# గ్రహాచార దర్పణము

## మొదటి భాగం



రచయిత:

**కప్పగన్తు సుబ్బరామ సోమయాజి సిద్ధాన్తి**

శ్రీ మహాగణాధిపతయే: నమ:



# గ్రహచార దర్పణము

రచయిత

బ్రహ్మశ్రీ కప్పగన్తు వేంకట సుబ్రహ్మణ్య ఘనపాఠిగారి పుత్రుడు

కీ॥శే॥ పీసపాటి వేంకప్ప సోమయాజి సిద్ధాన్తి గారి ప్రియశిష్యుడు అగు


**సుబ్బరామ సోమయాజులు**

**శ్రీ లక్ష్మీ నృసింహ జ్యోతిషాలయమ్**

నృసింహకృప బిల్డింగ్స్, 1-4/4-16, శంకరమఠం వీధి,

కామకోటినగర్, విద్యాధరపురం,విజయవాడ -12.

ఫోన్ : 2414336





ప్రతులకు

**శివకామేశ్వరి గ్రంథమాల**

41-22-4-36, భ్రమరాంబపురం, కృష్ణలంక

విజయవాడ - 520 013

ఫోన్: 2522824




**గ్రహచార దర్పణము**

కప్పగన్తు సుబ్బరామ సోమయాజి సిద్ధాన్తి

**ఆవిష్కరణ:**

**చిత్రభాను సంవత్సర మార్గశిర బహుళదశమి.**


ప్రచురణ, కాపీరైట్స్:

**శ్రీ శివకామేశ్వరి గ్రంథమాల**

41-22-4-36, భ్రమరాంబపురం, కృష్ణలంక,

విజయవాడ - 520 013. ఫోన్ : 2522824.

టైప్ సెట్టింగ్:

**ఫైన్‌లైన్**

విజయవాడ . ఫోన్ : 2418925

ముద్రణ:

**నిర్మలా ఆఫ్‌సెట్**

గాంధీనగర్, విజయవాడ -3.

ఫోన్ :624828

వెల: రూ. **45**

# శ్రీ మహాగణాధిపతయే నమః

## ....ముందుమాట....

ప్రస్తుతం సమాజాన్ని పట్టి పీడిస్తున్న సమస్య జ్యోతిషం సైన్సా? కాదా? దీన్ని యూనివర్శిటీలో ప్రవేశపెట్టాలా? లేదా?. అయితే దీనిమీద ప్రతివారు వారివారి సమాధానం, వారి అభిప్రాయం చెబుతూనే వున్నారు. అయితే అభిప్రాయం చెప్పేవారందరికీ జ్యోతిషం తెలుసా ? లేదు. కేవలం జ్యోతిషం చదివిన వారు ఈ విషయంలో వారి అభిప్రాయాన్ని చెప్పాలి. జ్యోతిషం చదివిన వారే జ్యోతిషం మీద అభిప్రాయం చెప్పాలి తప్ప అందరూ చెప్పకూడదని నా అభిప్రాయం. అంతే కాకుండా ప్రస్తుత సమాజంలో చాలామంది జ్యోతిషమును జీవనోపాధిగా ఎంచుకొనుచున్నారు. అందులో కొందరు జ్యోతిషం ఏదేని గురువు దగ్గర చదివి, మరికొందరు చదవకుండా వచ్చిన వారున్నారు. అందువలన జ్యోతిషం మీద జీవనోపాధి సాగించే వారికి - సైన్సా ? కాదా? అని చర్చించే వారికి యిరువురికీ ఉపయోగిస్తుంది అనే ఆలోచనలతో నేనీ ప్రయత్నం చేస్తున్నాను. ఈ ప్రయత్నం ప్రారంభానికి ముందు నేను అనేకమంది పెద్దల సలహాలు, సంప్రదింపులు పూర్తి చేసి నేనీ బృహత్తర కార్యాన్ని ప్రారంభించాను. ఈ పుస్తక రచనకు ముందు నేను " వాస్తుసుధ" (సమగ్రవాస్తు పరిశీలనా గ్రంథం) " ముహూర్త సుధ" (సమగ్ర ముహూర్త ధర్మ శాస్త్రము విషయ పరిశీలనా గ్రంథం) వ్రాసి యుంటిని. అలాగే ప్రజలు చైనా వాస్తు గూర్చి అమాయకత్వంతో వెంటబడుతున్న కారణంగా ఈ చైనా వాస్తు భారతీయులనుండి వెళ్ళినది అని నిరూపించుటకై "భారత - చైనా వాస్తు విజ్ఞానం " అనే పుస్తకము వ్రాసి యుంటిని. వీటిని వ్రాయుటలో ఆంతర్యం శాస్త్రావగాహన ప్రజలలో పెంచాలి అనే వుద్దేశ్యమే.

**సూచన :-** జ్యోతిషం అనేది నవగ్రహాలు ద్వాదశరాశుల కు మధ్య వున్న Permitations & Combinations. అయితే ఈ గ్రహాల కాంబినేషన్స్ లోనే ఆధిపత్యములు,స్థితి, వేరు గ్రహాలతో కలయిక, వేరు గ్రహాలతో వీక్షణలను పరిశీలించాలి. ఈ పరిశీలనలు, జన్మ లగ్నాత్, చంద్ర లగ్నాత్, దశా నాధాత్ కూడా చూడాలి. అది కాక గోచార పరిశీలన దృష్టిలో వుంచుకొని ఫలితాలు నిర్దేశించాలి. ఈ ప్రతి కాంబినేషన్ కూడా గణితపరంగా వుంటుంది. శాస్త్రం చక్కగా చెప్పబడియున్నది. శాస్త్రాధ్యయన అమలులోనే ఇబ్బందులు ఎదురవుతున్నాయి.

ఈ పుస్తకంలో షోడశవర్గులు, షడ్బల వివరణ, అష్టక వర్గు, గోచార విషయం,నష్ట జాతకాధ్యాయం యిచ్చాము. అందు ముఖ్య ఉద్దేశ్యం ఏమనగా, గణితాధ్యాయం ముందుగానే నేర్చుకొనినచో కొంత జ్యోతిష అధ్యయనం సులభతరం అవుతుంది. ప్రశ్న భాగం అధ్యయనముకు చిన్నది అమలుకు పెద్దది. అందు వలన ప్రారంభం నుండే ప్రశ్న భాగం అధ్యయనం చేసిన ఎడల

జ్యోతిష అధ్యయనం పూర్తి అగు నాటికి ప్రశ్న భాగం అమలు కూడా బాగా కుదురుతుంది. అనే ఉద్దేశ్యంతో ప్రశ్నభాగం ద్వితీయభాగంగా ప్రచురించదలిచాము.యిది పెద్దల సలహాల మేర చేసిన పనియే. జ్యోతిష అధ్యయన విషయంలో గోచారవిషయం పెడగా వున్నప్పటికీ సులభమార్గం కోసం ఉపయోగించేది., కావున దాన్ని కూడా ప్రారంభంలోనే అధ్యయనం చేయుట మంచిది. ఈ గ్రహచార దర్పణం తర్వాత భాగములు ఫలితాధ్యాయములు. యిందులో ప్రతి విషయము మహర్షులు చెప్పినవే కాని మేము స్వతంత్రించి వ్రాసినవి కాదు. శాస్త్రం మేము వ్రాయుట లేదు కేవలం శాస్త్ర అధ్యయన సులభ మార్గములు వివరిస్తున్నాము. యిందలి షోడశ వర్గ గణితము, షడ్బల సాధన, అష్టక వర్గు యివి అందరికీ తెలిసినవే అయినప్పటికీ వెంటనే స్ఫురణకు వచ్చునవిగా వుండవు కావున వీటిని అన్నిటినీ ఒక పుస్తక రూపంలోవుంచుట వలన లాభదాయకంగా వుండుననే వుద్దేశ్యంతో చేసితిమి. జ్యోతిషశాస్త్రం ఒక వరుసక్రమంలో చదువుకోవడానికి, అమలు చేయడానికి సులువు మార్గంగా వుంటే బాగుంటుంది . దానికి మీరు ఏదైనా విధానం ఆలోచింపరాదా ? అని నా సన్నిహితులు అడగటం – ఈ మధ్య జ్యోతిషశాస్త్రం మీద చర్చలు అధికంగా వుండటం వీటిని అన్నింటినీ దృష్టిలో వుంచుకొని నేను ఈ ప్రయోగం ప్రారంభించినాను.

కంప్యూటర్ జాతకాలలో ఒకదానికి వేరొకదానికి తేడాలు వున్నాయి అని వచ్చిన మాటలను దృష్టిలో వుంచుకొని మొదటి భాగం అంతా గణితం చేసే విధానాలు రెండవభాగం అంతా ప్రశ్న చెప్పే విధానం యిచ్చాము. ఈ గ్రహచారదర్పణం మొత్తం ఆరు భాగాలుగా విడుదల చేయదలిచాము.

అయితే రాశిశీలాధ్యాయము, ఋక్షశీలాధ్యాయము, నష్టజాతకాధ్యాయము యివి మొదటిభాగంలో యివ్వడంలో ఆంతర్యం ఏమనగా ఒక జాతకుడు నక్షత్రసంధిలోగాని, రాశిసంధిలోగానీ, లగ్నసంధిలో గానీ జననం అయితే వాని నక్షత్ర,రాశి,లగ్న పరిశీలన చేసి కదా మిగిలిన విషయాలు పరిశోధించాలి. అందుకోసమే వీటిని అధికంగా అధ్యయనం చేయాలి. వీటి ఆధారంగా ఫలానా నక్షత్రజాతకుని లక్షణాలు యివి,ఫలానా లగ్నజాతకుని లక్షణాలు యివి అని మనం ముందుగా నిర్ధారణ చేయగలిగితే, సంధిలగ్నాలను తేలికగా సాధించవచ్చు. అందుకే వీటిని ప్రథమ అధ్యాయంలో యిచ్చాము. ఈ విషయములు వ్రాయుటలో సారావళియందలి నష్టజాతకాధ్యాయము యథాతథముగా ఇవ్వవలసి వచ్చినది. ప్రతిపుస్తకంలోని విషయములను కలిపి ఒకచోట వ్రాయుట గ్రంథరచన అవ్వదు కానీ ఇది ఒక విద్యార్థి చదువుకోవడం కోసం ఉపాధ్యాయుడు తయారుచేసే నోట్సులాగా దీనిని చేయవలెను అనే ప్రధానోద్దేశ్యంతో ఈ పుస్తకమును తయారు చేశాము. ఈ పుస్తకమునకు రచయిత అని పెట్టుకోవడం కంటే సంకలనకర్త అని పెట్టుకోవడమే సమంజసం. ఇది జ్యోతిశ్శాస్త్రాధ్యయనమునకు స్టడీమెటీరియల్ లాంటిది. అయితే కొన్ని విషయాలలో నా సొంత ఆలోచనలు, అనుభవాలు పెద్దలు ఇచ్చిన వారి అనుభవవిశేషాలు కూడా కలుపుట చేత దీనికి రచయితగా నాపేరు పెట్టుకున్నాను. గోచార ఫలితాలు చెప్పే విషయమై బహుగ్రంథాలలోని వేరువేరు విషయములను ఒక వరుసక్రమములో వుంచి ఫలితములు

నిర్ణయించాను. కానీ జ్యోతిషార్ణవ నవనీతంలోని నక్షత్రరీత్యా శనిసంచారఫలితములు వేరు గ్రంథములలో కానరాని కారణముగా యథాతథముగా ఇవ్వవలసి వచ్చినది.

నేను ఈ గ్రంథం మొత్తానికి బృహత్పరాశరీ హోరాశాస్త్రం ఆధారం చేసుకొని దాని విశేషాల వివరణకు యితర గ్రంథాల సహాయము పొంది, పెద్దల సలహాలను ప్రతివిషయంలోను తీసుకుంటూ ఈ కార్యాన్ని చేపట్టాను. కొన్ని విషయములకు బృహజ్జాతకమును ప్రధానముగా తీసుకొనవలసి వచ్చినది.

సూచన :- మరల ఒకసారి గుర్తు చేస్తున్నాను. నేను శాస్త్రం వ్రాయుట లేదు. శాస్త్ర అధ్యయన సులభశైలి విధానం వ్రాస్తున్నాను అంతే.

గ్రహకారకత్వములు, భావకారకత్వములను ప్రతిగ్రంథమందలి విశేషాలను యిందు పొందు పరచాను. అయితే Modern Astrology గా వారు పేరుగాంచిన K.P పద్ధతిని కూడా యిందు వివరిస్తున్నాను.

సులభమార్గము కొరకు యిందలి చాలా విషయములకు పరాశరులు చెప్పిన శ్లోకాలు ఈయక వాటిని పట్టిక రూపాలలో వుంచితిని. దేశాంతర సంస్కార విధానము యిచ్చితిని. అష్టకవర్గు విధానం మీద ఫలితాంశములు చెప్పుటకు ఫలదీపిక, జాతక పారిజాతం,లఘుజాతకం,పరాశరహోర, వీటిని పరిశీలించి వ్యాఖ్యానము వ్రాసియుంటిని. ఫలదీపిక, గోచారదర్శిని, బృహద్దైవజ్ఞ రంజనమ్, K.P.SYSTEM లోని TRANSIT జ్యోతిషార్ణవ నవనీతం ఆధారంగా గోచారఫలితాలను ఇచ్చాము.

జాతక ఫలితాధ్యయన విషయంలో పరాశరులు, జైమిని,వీరివీరి విధానమును కూడా విశదీకరించ దలచిన కారణంగాను అనేక గ్రంథాలలోని విషయాలను కూడా ఈ గ్రంథమునందు ఈయదలిచిన కారణంగా దీనికి గ్రహచార దర్పణము అని నామకరణం చేశాను. ఒక విషయ పరిశీలనకు బహుగ్రంథ విషయాలను ఒకచోటనే పొందుపరచిన యెడల చదువరులకు ఇతరగ్రంథ పరిశీలనావశ్యకత ఉండకపోవడం చేత ఎక్కువ పరిశ్రమ ఫలితాంశములమీద వుంచి సత్ఫలితాలను ఎక్కువగా పొందుతారనే ఉద్దేశ్యంతో ఈ ప్రయోగం చేస్తున్నాను. జ్యోతిశ్శాస్త్రంలో ఎంత అధ్యయనం చేసినా ఇంకా చేస్తూ ఉండవలసిన విశేషములు అనేకం ఉంటాయి. దీనికి అంతం లేదు. ఈ పుస్తకం ద్వారా పాఠకులకు జ్యోతిశ్శాస్త్రంమీద అవగాహన అధికంగా తీసుకురాగలను అని అనుకుంటున్నాను. నేను ప్రతిగ్రంథముకు అనేకమంది వ్రాసిన వ్యాఖ్యానములను చదివితిని. ప్రతి వ్యాఖ్యానములోను ఒక్కొక్క క్రొత్త విషయమును గుర్తించాను. నేను 1995 డిసెంబరులో మహర్షి మహేష్‌యోగి ఇన్‌స్టిట్యూట్ వారి సంస్థలో జ్యోతిష ఉపాధ్యాయుల ఇంటర్వ్యూకు వెళ్ళితిని. ఇంటర్వ్యూ బ్రహ్మశ్రీ మధుర క్రిష్ణమూర్తి శాస్త్రి గారు చేశారు. ఆ ఇంటర్వ్యూకి వెళ్ళడంలోని ప్రధానోద్దేశ్యం శ్రీశాస్త్రిగారు చేసిన ఇంటర్వ్యూ ద్వారా భవిష్యత్తులో నేను చేయబోయే జ్యోతిశ్శాస్త్ర పరిశీలనకు ఆయనద్వారా మార్గం తెలుసుకోవచ్చని ఇంటర్వ్యూకి వెళ్ళాను. ఇంటర్వ్యూలో సెలక్ట్ అవ్వడం జరిగింది. శ్రీశాస్త్రిగారి సలహామేరకు సారావళి, జాతకపారిజాతము ఇటువంటి గ్రంథములన్నీ వివిధరచయితల చేత వ్రాయబడిన వ్యాఖ్యానములన్నీ

చదివితిని. అంతేగాకుండా K.P. system ద్వారా జ్యోతిషం అధ్యయనం చేసేవిధానము కూడా పరిశీలనము చేసితిని. ప్రస్తుతంఈ గ్రంథరచనలో కేవలం పరాశరమతమును అనుసరించి దానికి K.P. system ను కూడా క్రోడీకరించి ఫలితములను నిర్ణయించే విధానమును విద్యార్థులకు అందజేయవలెనను ఉద్దేశ్యంతో ఈ బృహత్తర కార్యమును చేపట్టితిని. అందుకే ఈ మొదటిభాగములో K.P. system లోని సబ్‌లార్డ్ విధానమును కూడా పొందుపరచాము. నా ఉద్దేశ్యంలో యూనివర్శిటీలలో ఈ జ్యోతిషం అవసరమా అంటే – " జ్యోతిశ్శాస్త్రమును ఈ పరిమితకాలంలో అధ్యయనం చేయుట అవదు. ఈ దృష్ట్యా యూనివర్శిటీలలో జ్యోతిషం అనవసరము. అంతేగాకుండా జ్యోతిషంలో ఒకభాగంగా వున్న ముహూర్తభాగమునకు ధర్మశాస్త్రము వెన్నెముక వంటిది. ఈ ముహూర్త ధర్మశాస్త్ర విషయములు గురువు దగ్గర విడిగా అధ్యయనం చేయుట వలన వేరువేరు ప్రాంతాల ఆచార వ్యవహారములను ఆధారం చేసుకొని ఈ రెండుభాగములు అధ్యయనం చేయుట జరుగుతుంది. అందువలన ఈ శాస్త్రములు గురువు దగ్గర అధ్యయనం చేసినంత సులువుగా యూనివర్శిటీలలో చేయుట కుదరదు. జ్యోతిష అధ్యయన పరులు కొంత ఉపాసన బలము పొందినపుడు శాస్త్రానికి వన్నె తీసుకురాగలరు. ఉపాసన మీద నిర్లక్ష్యం ఉన్నచో ఫలితాంశములు చెప్పుటలో వైఫల్యములు తొంగిచూడగలవు. ***మన పూర్వులు సాధనతో జీవనం గడిపితే నేడు మనము సాధనాలతో జీవనం గడుపుతున్నాము. సాధనతో ఉన్న పరిపూర్ణత సాధనములతో ఉండదు.*** వరాహ మిహిరులు ఏ సాధనములు వాడుకొని ఖగోళశాస్త్రమును చెప్పారు. ఇది ఊహించదగిన విషయమేనా ! సాధనాలు లేని రోజులలోనే సాధనతో సాధించిన విషయమిది. సాధన వీడి సాధనముల మీద ఆధారపడిన కారణంగానే మనకు అవసరమైన విషయములమీద కంటే అనవసరమైన విషయముల మీద చర్చలుచేస్తున్నాము. అంతేగాకుండా మన ఆర్షవిద్యలను – ఇవి తప్పా? ఒప్పా? అని చర్చించే దుస్థితికి దిగాము. వేదములు, మహర్షులచే చెప్పబడిన శాస్త్రములు, ప్రపంచంలో అందరూ గౌరవిస్తుంటే మన భారతీయులు మాత్రం వీటిమీద అనవసర చర్చలు చేస్తున్నారు. కావున ఆ చర్చలు వదిలి అందరూ శాస్త్రాధ్యయనం చేస్తే శాస్త్రాభివృద్ధి జరగగలదు అని ఈ ప్రయోగం ప్రారంభించాను. మరల ఒకసారి గుర్తు చేస్తున్నాను. ఇది కేవలం జ్యోతిశ్శాస్త్ర అధ్యయనపరులకు ఒక స్టడీమెటీరియల్ మాదిరి తయారు చేయడం జరిగింది. దీనిని గుర్తించి ప్రోత్సహించగలరని ఆశిస్తున్నాను. ఈ గ్రంథప్రచురణకు సహాయం చేసిన వారందరికీ భగవంతుడు సదా ఆయురారోగ్య ఐశ్వర్యములు ప్రసాదించాలని కోరుకొనుచున్నాను.

**"శాస్త్రాధ్యయనం చేయకుండా శాస్త్రం మీద చర్చ చేయుట తప్పు"**

భవదీయుడు

**సుబ్బరామ సోమయాజులు...**

# విషయసూచిక


నవగ్రహస్తోత్రం ........ 1

దేశాంతర సంస్కారం ........ 2

భావకారకత్వములు ........ 3

గ్రహకారకత్వములు ........ 5

కారకత్వ విశేషములు ........ 6

రాశి శీలాధ్యాయము ........ 8

గ్రహశీలాధ్యాయము ........ 10

షోడశవర్గులు ........ 12

- రాశి ........ 12
- హోరా ........ 12
- ద్రేక్కాణము ........ 13
- చతుర్థాంశ ........ 13
- సప్తాంశ ........ 14
- నవాంశ ........ 14
- దశాంశ ........ 15
- ద్వాదశాంశ ........ 16
- షోడశాంశ ........ 17
- వింశాంశ ........ 18
- చతుర్వింశాంశ ........ 19
- భాంశ ........ 21
- త్రింశాంశ ........ 22
- ఖవేదాంశ ........ 23
- అక్షవేదాంశ ........ 25
- షష్ట్యంశ ........ 27
- వర్గభేదనిరూపణ ........ 30
- వర్గవింశోపకబలము ........ 32

అశ్విన్యాదినక్షత్ర జననఫలము ........ 34

మేషాది లగ్నజనన ఫలము .................... 36
పారిజాతమందలి విశేషములు .................... 43
విశేష లగ్నగణన .................... 45
భావలగ్నము .................... 45
హోరాలగ్నము .................... 46
ఘటీలగ్నము .................... 46
వర్ణదలగ్నము .................... 46
ఇందులగ్నము .................... 47
దృష్టివిషయాధ్యాయము .................... 47
భావచక్రము .................... 48
నతము .................... 49
జన్మలగ్నస్ఫుటవిధానము .................... 49
నతమును భాగలు చేయుట .................... 49
భావసాధన .................... 50
ఆరూఢచక్రము .................... 50
గ్రహసమయములు .................... 51
షడ్బలవివరము .................... 53
స్థానబలము .................... 53
ఉచ్ఛబలము .................... 53
ఓజయుగ్మరాశి బలము .................... 54
కేంద్రాదిస్థబలము .................... 55
తాత్కాలిక మిత్రత్వ శత్రుత్వములు .................... 55
ద్రేక్కాణబలము .................... 55
దిగ్బలము .................... 56
కాలబలము .................... 56
నతోన్నతబలము .................... 56
అక్షబలము .................... 57
త్రిభాగబలము .................... 57

హోరబలము ........ 57
అయనబలము ........ 58
యుద్ధబలము ........ 58
దృగ్బలము ........ 58
చేష్టాబలము ........ 59
నైసర్గికబలము ........ 59
ఉపఅధిపతి (Sub-Lord) ........ 60
వింశోత్తరీ దశాసాధన ........ 67
విదశాపట్టికలు ........ 69
అప్రకాశక గ్రహగణన ........ 78
ధూమఫలము ........ 79
వ్యతీపాతఫలము ........ 80
పరిధిఫలము ........ 81
ఇంద్రచాపఫలము ........ 82
ఉపకేతుఫలము ........ 83
గుళికఫలము ........ 84
గోచార ఫలాధ్యాయః ........ 85
వేధాస్థానములు ........ 87
మూర్తినిర్ణయం ........ 89
ఫలితాధ్యాయం ........ 89
అష్టకవర్గు ........ 100
త్రికోణశోధన ........ 104
ఏకాధిపత్యశోధన ........ 105
మండలశోధన ........ 106
రాశిపిండగణన ........ 106
గ్రహపిండగణన ........ 106
ఫలితాధ్యాయము ........ 106

# పుస్తక ప్రచురణకు సహకరించిన దాతలు

| | |
|---|---|
| **శ్రీ చలువాది మల్లికార్జునరావు గారు** | విజయవాడ |
| **శ్రీ నందిగం శివరామ ప్రసాద్ గారు** | విజయవాడ |
| **శ్రీ వేమూరి సుబ్బారావు గారు**<br>(శ్రీలక్ష్మి ఏజెన్సీస్, సామారంగంచౌక్. Ph :2561608) | విజయవాడ |
| **శ్రీ కె. రత్నకుమార్ గారు**<br>(శబరి టెక్స్‌టైల్స్, షాపు నెం. 267, వస్త్రలత Ph :2422267) | విజయవాడ |
| **శ్రీ సి.హెచ్. శ్రీనివాస్ గారు**<br>(సాయి ఫర్నిచర్స్, అలీబేగ్ స్ట్రీట్, గవర్నర్‌పేట, Ph:2575005) | విజయవాడ |
| **శ్రీ పబ్బిశెట్టి వెంకట సత్యకుమార్ గారు** | కొల్లూరు |
| **కీ॥శే॥ శ్రీ చెరువు బాలకృష్ణ గారి ధర్మపత్ని**<br>**శ్రీమతి చెరువు పూర్ణలక్ష్మి గారు** | కొల్లూరు |
| **శ్రీ డోగుపర్తి మధుసూదన్ గారు**<br>(DhanuSh Garments, Tirupur, TamilNadu) | |
| **కీ॥శే॥ తాడికొండ సుబ్బారావు గారి జ్ఞాపకార్థం వారి కుమారులు**<br>**శ్రీ వేంకటసత్యసుధాకర్, విజయకుమార్ గార్లు**<br>జ్యోతి బైండింగ్ వర్క్స్, పులిపాటివారి వీధి. ఫోన్ : 5559173 | విజయవాడ |

# నవగ్రహస్తోత్రమ్

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయేత్  సర్వవిఘ్నోప శాంతయే

శ్రీమన్నృసింహవిభవే గరుడధ్వజాయ
తాపత్రయోపశమనాయ భవౌషధాయ,
తృష్ణాదివృశ్చిక జలాగ్నిభుజంగరోగ
క్లేశవ్యయాయ హరయే గురవే నమస్తే

శ్లో ॥ ఆదిత్యాయ చ సోమాయ మంగళాయ బుధాయ చ,
గురుశుక్రశనిభ్యశ్చ రాహవే కేతవే నమః. 1

శ్లో ॥ జపాకుసుమసంకాశం, కాశ్యపేయం మహాద్యుతిమ్,
తమోఘ్నం సర్వ పాపఘ్నం ప్రణతోఽస్మి దివాకరమ్. 2

శ్లో ॥ దధిశంఖతుషారాభం, క్షీరోదార్ణవసంభవమ్,
నమామి శశినం సోమం, శంభోర్మకుట భూషణమ్. 3

శ్లో ॥ ధరణీగర్భసంభూతం, విద్యుత్కాంతిసమప్రభమ్,
కుమారం శక్తిహస్తంచ, మంగళం ప్రణమామ్యహమ్ 4

శ్లో ॥ ప్రియంగుకలికాశ్యామం, రూపేణాప్రతిమం బుధమ్,
సౌమ్యం సౌమ్యగుణోపేతం,తం బుధం ప్రణమామ్యహమ్. 5

శ్లో ॥ దేవానం చ ఋషీణాం చ గురుం కాంచన సన్నిభమ్,
బుద్ధిమంతం త్రిలోకేశం, తం నమామి బృహస్పతిమ్. 6

శ్లో ॥ హిమకుందమృణాలాభం, దైత్యానాం పరమం గురుమ్
సర్వశాస్త్ర ప్రవక్తారం, భార్గవం ప్రణమామ్యహమ్. 7

శ్లో ॥ నీలాంజన సమాభాసం, రవిపుత్రం యమాగ్రజమ్,
ఛాయామార్తాండ సంభూతం, తం నమామి శనైశ్చరమ్. 8

శ్లో ॥ అర్ధకాయం మహావీరం, చంద్రాదిత్య విమర్దనమ్,
సింహికాగర్భసంభూతమ్, తం రాహుం ప్రణమామ్యహమ్. 9

శ్లో ॥ పలాశపుష్పసంకాశం, తారకాగ్రహమస్తకమ్,
రౌద్రంరౌద్రాత్మకమ్ ఘోరం, తం కేతుం ప్రణమామ్యహమ్. 10

# దేశాంతరసంస్కారం

స్టాండర్డ్ టైమ్,లోకల్ మీన్‌టైమ్ అని రెండు రకాల ముఖ్యమయిన సమయాలు మనకు అమలులో వుంటాయి. ఒక దేశంలో ఒక స్టాండర్డ్ టైం వుంటుంది. ఉదాహరణకు యిండియాలో 5-30 A.M స్టాండర్డ్ టైమ్ వుంటుంది దానిని I.S.T అంటారు. దీనిని $82^0 30'$ అక్షాంశం దగ్గర సమయాన్ని బట్టి నిర్ధారించి- దానిని I.S.T గా గుర్తించి దేశంమొత్తం I.S.T ఆధారంగా సమయం నిర్ణయించారు. దీనికి కారణం ఏమనగా ఒకేదేశంలో వివిధసమయములు వాడకంలో వుంటే అన్ని రంగాలలోను యిబ్బందులు ఎదుర్కోవలసి వుంటుంది అని ఒకే స్టాండర్డ్ టైమ్ వినియోగించారు. ఉదాహరణకు ఢిల్లీ మ 12-00 గం ॥లకు వార్తలు D.D ప్రసారం చేసింది అనుకోండి భారతదేశం అంతా 12-00 గం॥ల స్టాండర్డ్ టైమ్ వుంటే D.D కార్యక్రమాల అమలు కుదురుతుంది. లేనిఎడల కష్టం అవుతుంది.

స్టాండర్డ్ టైమ్ లేనిఎడల రైల్వేస్, బస్‌సర్వీసెస్, విమానసర్వీసులు, పరిపాలనా రంగాలలో యిబ్బందులు కలుగుతాయి. అయితే స్టాండర్డ్ టైమ్ వాడుకొని అక్షాంశ రేఖాంశలద్వారా లోకల్ మీన్ టైమ్‌ను కనుగొనాలి. ఆ పద్ధతికి ఉదాహరణ క్రింద యివ్వబడినది.

ఉదా:- న్యూ ఢిల్లీ స్టాండర్డ్ టైమ్ 8-30A.M.

LAT # LON for New Delhi ----- $77^0$-12' East $28^0$- 40' North

$82^0$ -30" 'స్టాండర్డ్ అక్షాంశం $82^0$ - 30లో నుండి ఢిల్లీ అక్షాంశం తీసివేయాలి. కారణం స్టాండర్డ్ అక్షాంశం కంటే ఢిల్లీ అక్షాంశం తక్కువ.

$(82^0-30) - (77^0-12) = 5^0-18$

$5-18^0 \times 4 = 21^0.12'$ - Time Difference (ఢిల్లీ సమయానికి, స్టాండర్డ్ సమయానికి)

I.S.T - Time Differnce = Local Mean time

(8-30-00A.M) - (0-21-12) = 8-8-48 .యిది లోకల్ మీన్‌టైమ్ అవుతుంది. (L.M.T. For Delhi)

82-30 కంటే పైనవున్న అక్షాంశ అయితే కూడాలి.

దానికి ఉదా:- 8-30 A.M. at Calcutta LAT LON = 22.34 # 88-24E

(88-24) - (82-30) = 5-54

5-54×4 = 23.36 = Time Difference

Local Mean Time - I.S.T+ Time Difference.

Local Mean Time = (8-30-00A.M) +_(00-23-36) = 8-53-36

ఈ పద్ధతిని వాడుకుని వివిధ పట్టణాల మధ్య దేశాంతర సంస్కారం చేయవచ్చు. ఉదాహరణకి

పైన కలకత్తా, ఢిల్లీ పట్టణాలకు 82° -30' నుండి దేశాంతర సంస్కారం చేశాము. కలకత్తా నుండి ఢిల్లీకి సంస్కారం కావలసిన ఎడల

8-30A.M. కు కలకత్తాలో 8-53 L.M.T

ఢిల్లీలో 8-8 L.M.T

ఈ మధ్య వున్న తేడా 44ని॥ల 48సెకండ్లు అనగా కలకత్తా టైమ్‌లో 44ని॥ల 48సెకండ్లు తీసివేస్తే ఢిల్లీ టైమ్ వస్తుంది. ఢిల్లీ టైమ్‌కు 44ని॥ల48సెకండ్లు కలిపితే కలకత్తా టైమ్ వస్తుంది. ఈ గణితముకు కావలసిందల్లా ప్రతిపట్టణంయొక్క LAT #LONలు మాత్రమే. Local Mean Time అనేది ప్రకృతి సిద్ధ సమయం. Standard Time మనం ఏర్పరచుకున్న కృత్రిమ సమయం. మనం జాతకం వేయునప్పుడు లోకల్ మీన్ టైమ్ ఆధారం చేసుకొని గణితం చేయవలెను.

# భావకారకత్వములు

ఈ కారకత్వములు బృహత్పరాశరీ ఆధారముగా ప్రధానం చేసి వ్రాయబడినవి, జాతక పారిజాతం, జాతక రాజీయం వంటియితర గ్రంథవిశేషములు కూడా యిక్కడ వివరించబడినవి.

- **లగ్నము వలన** – జాతకుని దేహము, రూపము, జ్ఞానము, రంగు, బలము, బలహీనము, సుఖము, దుఃఖము,స్వభావము తెలియును.

  **యితరగ్రంథ విశేషము** – యశస్సు,లక్షణము,సాహసము,దేహమానము,శరీరమందలి మచ్చలు యితరుల ద్వారా మోసగింపబడుట, అలవాట్లు, కీర్తి.

- **లగ్నాత్** రెండవ **యింటిద్వారా** – ధనము, ధాన్యము, కుటుంబము, మృత్యువు, శత్రువు, ధాతువులు, రత్నములు మొదలగు వాటిని గూర్చి విచారింపవలెను.

  **యితరగ్రంథ విశేషము** – కనులు,సుఖము,విద్య, ఆహారవిషయము, అమ్మకం, కొనుగోలు విషయాలు, ధనసంబంధ నష్టాలు, కుడికన్ను, ప్రయాణ, భుక్తి, రత్నము, ధాతువులు,ముఖము, భోజనము

- **లగ్నాత్ మూడవ యింటిద్వారా** – పరాక్రమము, సేవకులు, సోదర,సోదరీ వర్గము, సన్నిహిత ప్రదేశప్రయాణ విషయము, పితృ మరణము విచారింపవలెను.

  **యితర గ్రంథ విశేషము** – కంఠము,సాహసము,కంఠస్వరము, కర్ణము, శక్తి, వీర్యము, దాసదాసీవర్గం, స్వరం, గరళభక్షణము, ఆభరణములు.

- **లగ్నాత్ నాల్గవ యింటివలన** – వాహనములు, బంధువులు, తల్లియొక్క ఆరోగ్య ఆయువులు, నిధులు, క్షేత్రములు (స్థలములు), గృహములను విచారింపవలెను.

  **యితరగ్రంథ విశేషము** – విద్యాసముపార్జన, సుగంధాది ద్రవ్య వినియోగము, పశుసంపద,

మానసిక వ్యవస్థ, పితృసుఖము, వాపీకూప తటాకము, సింహాసనము.

- **లగ్నాత్ అయిదవ యింటివలన** – యంత్రములు,మంత్రదీక్ష, విద్య,బుద్ధి,ప్రబంధ రచనాదికము, పుత్రులు, రాజ్యలాభము, పదవీభ్రష్టత్వములు విచారింపవలెను.

  **ఇతరగ్రంథ విశేషము** :– రాజ్యము, మేధస్సు, యాత్ర, ప్రతిభ.

- **లగ్నాత్ ఆరవ యింటివలన** – మేనమామలు, మృత్యుశంక, శత్రువులు, వ్రణములు, రోగములు, సవతి తల్లి, ఈ విషయములు విచారింపవలెను.

  **యితరగ్రంథ విశేషము** – వ్యసనములు, క్రూరకర్మలు,సంగ్రామం, మేనమామ, జ్ఞాతి.

- **లగ్నాత్ ఏడవ యింటి ద్వారా** – భార్య, ప్రయాణము, వాణిజ్యము, నష్టవస్తు విషయము, మరణము విచారింపవలెను.

  **యితరగ్రంథ విశేషం** – అర్ధాంగి రూపురేఖలు, యాత్రా సౌఖ్యము, కామము, భోగము, వ్యభిచారము, ఛత్రము, దంతము, నాభి.

- **లగ్నాత్ ఎనిమిదవ యింటిద్వారా** – ఆయువు, రణము, దుర్గము, మృతధనము, మరణము విచారింప వలెను.

  **యితర గ్రంథ విశేషములు** – సర్వ విధ నష్టము, భయము, ఖైదు, నాశనము, నైధనం, గుహ్యా ప్రవేశము

- **లగ్నాత్ తొమ్మిదవ యింటిద్వారా** – భాగ్యము, భార్య సోదరుడు, ధర్మము, సోదరుల భార్యలు, వారి శుభాశుభములు, తీర్థయాత్రల గూర్చి తెలియును.

  **యితర గ్రంథ విశేషములు** – తండ్రి, అధికారము, శుభములు, ధర్మకార్యాచరణ, భాగ్యము, భోగము, తపస్సు.

- **లగ్నాత్ పదవ యింటిద్వారా** – రాజ్యము, ఆకాశ వృత్తాంతము, గౌరవము, కీర్తి, పితృ సుఖము, ప్రవాసము, ఋణములు గూర్చి తెలియును,

  **యితర గ్రంథ విశేషములు** –గౌరవము, భూషణములు, నిద్ర, వ్యవసాయము, ఊరువులు, జానువులు, కార్యకలాపములు, విద్య, విజ్ఞానము, పదవీప్రాప్తి, పితృసంబంధీకుల సుఖదుఃఖాలు.

- **లగ్నాత్ పదకొండవ యింటిద్వారా** – వస్తుసంపత్తి, పుత్రుని భార్య, ఆదాయము, పశువృద్ధిని గూర్చి విచారింపవలెను.

  **యితర గ్రంథ విశేషములు** – విద్యాలాభము, శృంగార ద్రవ్యములు, కన్యా ప్రాప్తి, జ్యేష్ఠ సోదర సోదరీలు, జయము, జంఘము, ఎడమచెవి.

- **లగ్నాత్ పన్నెండవ యింటిద్వారా** – ధనవ్యయము, శత్రు వృత్తాంతము, జన్మాంతమందలి

విషయములు విచారింపవలెను.

**యితర గ్రంథ విశేషములు** - దూరదేశ సంచారం, దుర్గతి, దండనము, వ్యయము, దుర్వ్యయము, సద్వ్యయము.

# గ్రహకారకత్వములు

ఈ క్రింద యివ్వబడిన కారకత్వములు అనేక గ్రంథాలను ఆధారంగా చేసుకొని మరియు పెద్దలు కొందరు వ్రాసిన వ్యాఖ్యానములు కూడా ఆధారం చేసుకొని యివ్వబడినవి.

**రవి** - వ్యక్తిత్వము, పితృసంబంధము, పలుకుబడి, ఆరోగ్యము, శక్తి, అదృష్టము, రాజ్యము, ధైర్యము, అధికారము, సంపదలు, అలంకారములు.

- **వృత్తి** - వైద్యము, ఉన్ని కేశములతో కూడిన వ్యాపారము, జలధాన్య వ్యాపారం, బ్రోకరైజింగ్, బంగారం.
- **విద్య** - రాజభాషా కౌశలం, యోగశాస్త్రం, అతీంద్రియ జ్ఞానశాస్త్రం, పశువిద్య, మనోయోగం, ఆకాశ సంబంధ విద్య, లౌకిక శాస్త్రం.
- **రోగం** - అగ్ని సంబంధము, తీవ్ర జ్వరము, పైత్యము, శస్త్రంచేత మరణము, రక్తపోటు, గుండెజబ్బులు, థైరాయిడ్, తాపం, మూర్ఛ, చర్మవ్యాధి.

**చంద్ర** - హృదయము, అవగాహనా శక్తి, రాజాభిమానము, తల్లి సంబంధము, మనస్సు, బుద్ధి, సౌందర్యము, సత్యము, రంజిత యాత్రలు, భోజనవిషయము, బాహువులు.

- **వృత్తి** - జలోద్భవముల వ్యాపారం, వ్యవసాయం, మట్టితో చేయడిన వస్తువులు, వాద్యములు, వినోదక్రియలు, వస్త్రవ్యాపారం
- **విద్య** - ధారణ వలన కలుగు విద్య, జల,సుగంధ సంబంధ విద్యలు.
- **రోగం** - కలరా, జలసంబంధ వ్యాధులు, వాతసంబంధ వ్యాధులు, జలుబు, స్త్రీలకు ఋతుచక్ర దోషం, ఛాతీ, పొట్ట యిబ్బందులు, నిద్రారోగం, జడత్వం, శీతజ్వరం, కామెర్లు, నపుంసక, రక్తదోషం, జానువులు.

**కుజ** - ధైర్యము, రోగము, ప్రవర్తన, సోదరుడు, భూమి, శత్రువులు, పరాక్రమము, కోపము, శతృవృద్ధి, సేనాధిపత్యము, గుణసంపద, యుద్ధము, ఋణము

- **వృత్తి** -ధాతువాదము, యుద్ధం, సైనిక వృత్తి, సాహస క్రియలు, చోరవృత్తి,
- **విద్య** - వృక్షశాస్త్రం, కంసాలిపని, అస్త్రవిద్య, సామవేదం.
- **రోగం** - ప్రమాదము, అగ్ని, మాయామంత్రశక్తులు, శస్త్రముచేత మరణము, సమస్త

శస్త్రరోగములు,రక్త, భౌమిక సంబంధ రోగములు, విదాహం, కుష్టు, మజ్జా భంగం, వైకల్యం.

**బుధుడు** – బంధువులు, విద్య, మేనమామ, సత్కార్యనిరతి, జ్ఞాతులు, మిత్రులు, వాక్కులు, కంఠము, వాక్చాతుర్యము, కార్యదక్షత జీవన చరిత్ర, హాస్యము, కర్మ, విజ్ఞానము, వ్యవహారము, వర్తకము.

- **వృత్తి** – శిల్పం, చిత్రలేఖనం, పుస్తకములు, వస్త్రాది నిర్మాణం, కావ్యరచన, పుస్తకములపై జీవనం.
- **విద్య** – సాహిత్య, గణిత, ఉపన్యాస, లేఖత్వ, శిల్ప, జ్యోతిష, వ్యాపార, యంత్ర నిర్మాణం, వేదాంత, మంత్ర,తంత్ర,వ్యాకరణ, పురాణ, అధర్వణ వేద, వేదవిద్యలు,
- **రోగం** – రక్తహీనత, చాంచల్యము చేత మరణము, మానసిక, నరములు తెగుట, చర్మములు, మెదడు, నేత్ర, పిత్త, వాత, చర్మరోగం, నాభి, ఎడమచెవి.

**గురువు** – శాస్త్రజ్ఞత, స్వప్రజ్ఞ, ధనము, ఆస్తి, అంగపుష్టి, పుత్రులు, విజ్ఞానము, ఆచారము, ఛాందసము, శాంతము, ధర్మము, బుద్ధి, గృహము, బంధుసుఖము,పుణ్యస్థలము, తపస్సు.

- **వృత్తి** – కులవృత్తి, ఉపాధ్యాయ, వడ్డీ వ్యాపారం.
- **విద్య** – ఋగ్వేద, ఆగమ, మీమాంస, తర్క, జ్యోతిష, ధర్మశాస్త్ర, వైదిక, వేదాంత, భాషా పాండిత్య, వ్యాపార,అలంకారం, తంత్రం.
- **రోగం** – సుఖమరణం, శ్లేష్మవ్యాధుల వలన మరణం, లివర్, జీర్ణశక్తి, చర్మరోగములు, అంత్రజ్వరం, మేహం, దంతములు, ఊరువులు.

**శుక్రుడు**– వివాహము, భాగ్యము, భోగము, వాహనం, నగలు, ప్రేమ, భార్య(భర్త), సంతోషము, కామము, వ్యభిచారము, మదాంధకారం, నేత్రములు, సత్యవాక్కు, సింహాసనము.

- **వృత్తి** – సువర్ణ, మాణిక్యాదులు, గజ,అశ్వ,గో, బెల్లం, అన్నం, క్షీరం, పెరుగు, వ్యాపారములు, పురోహితం
- **విద్య** – వాహన, యానవిద్య, అలంకరణవిద్య, యజుర్వేద, నాట్య, వ్యాపార, సంగీత, వాద్య, రత్నపరీక్ష, సుగంధద్రవ్య రసాయన, కామశాస్త్ర, జలక్రీడ, నాటక, కవిత్వం.
- **రోగం** – స్త్రీ సంగమ సంబంధ రోగముతో మరణము, గొంతురోగము, మూర్ఛ, నేత్రములు, పాండు, వాత శ్లేష్మ, నేత్ర మూత్ర వ్యాధులు, గృహ్య, శుక్లనష్టం.

**శని** – జాతకుని జీవన నిర్ధారణ, సంపాదన, మరణము, దురదృష్టములు, సేవకా విషయములు, నీచవిద్య, నీచదేవోపాసన, బంధనము, కురూపము,జ్ఞాతులు.

- **వృత్తి** – నీచకర్మలు, కఱ్ఱ సామాను, వధాదులు, కూలిపని, భారదహనం, జూదము, వంచన.
- **విద్య** – పక్షి శాస్త్రం, యినుము, విదేశీ భాషా జ్ఞానం, వ్యవసాయం, మోహన విద్య, విద్వేషం, భ్రమణోచ్చాటన, మారణాయుధ, భూగర్భసంబంధ విద్య,

- రోగం – తీవ్ర జ్వరము, వాత రోగము, క్యాన్సర్, ఆస్తమా, టి.బి, చెవి, జుట్టు, శ్లేష్మ మాంద్యము, పాదపీడ, ఉదర రోగం, ఉష్ణాధిక్యం, పార్శ్వ పీడ, పిశాచపీడ, శ్రమ.
- **రాహువు** – పితామహుడు, తటాకాదులు, ఆరామములు, మాతామహ, నీచజీవనం.
- **విద్య** – జూద, రసవాద, విషవైద్య.
- **రోగం** – కుష్టురోగం, విషాహారము, మశూచి, హృదయతాపం, కుష్టు, మతిభ్రమ, విషపీడ, పాదపీడ, సర్ప, పిశాచ.

**కేతువు** – మాతామహుడు, మోక్షము, జ్ఞాన వైరాగ్యములు.

- **విద్య** – దేవతోపాసన విద్య, వైద్య, మంత్రశాస్త్ర, బ్రహ్మవిద్య
- **రోగం** – అసహజ మరణము, కీటకాదుల ద్వారా మరణము.

**కారకత్వములలో విశేషములు :–** పగలు పితృకారకుడు రవి, రాత్రి మాతృకారకుడు చంద్రుడు, పగలు మాతృకారకుడు శుక్రుడు, రాత్రి పితృకారకుడు శని

**భావకారకత్వములు :–** లగ్నమునకు సూర్యుడు, ద్వితీయముకు గురువు, తృతీయముకు కుజుడు, చతుర్థముకు బుధుడు, పంచమముకు గురువు, షష్ఠముకు కుజుడు, సప్తమునకు శుక్రుడు, అష్టమునకు శని, నవమునకు గురువు, దశమునకు బుధుడు, లాభముకు గురువు, వ్యయముకు శని (ఫలదీపికనుండి) చతుర్థముకు బుధచంద్రులు, షష్ఠమునకు శనికుజులు, నవమునకు దశమునకు రవిగురువులు.

**ఫలదీపికనుండిమరికొన్ని విశేషములు :–** రవి వున్న స్థానమునుండి పితృదేవుల రూపము మొదలగునవి, రవికి ద్వితీయమునుండి తండ్రియొక్క ఆస్థి, ఖ్యాతి, తృతీయమునుండి సోదర వర్గము, నడవడిక, చతుర్థమునుండి తల్లి విశేషములు, సౌఖ్యము తెలుపవలెను. రవి వున్న ఇంటినుండి ఐదవ ఇంటివలన తండ్రియొక్క మేధస్సు, ఆరవ ఇంటివలన కష్టములు, రోగములు, ఏడవ ఇంటివలన ప్రేమాదులు, ఎనిమిదివ ఇంటివలన ఆయుష్షు, మరణము, తొమ్మిదవ ఇంటివలన శుభకర్మలు, పదవ ఇంటివలన వృత్తి, పదకొండవ ఇంటివలన తండ్రియొక్క సంపాదన, రాబడి, రవిలగాయితు పన్నెండవ ఇంటివలన తండ్రియొక్క ఖర్చులు, నష్టము విచారింపవలెను.

"ఏవంహి తత్కారకతో విచిన్త్యం పితృశ్చ మాతృశ్చ సహోదరశ్చ" అని వున్న కారణంగా మాతృకారకుడు చంద్రుని నుండి పైవిధంగా చెప్పబడిన స్థానానుగుణ్యంగా మాతృవిశేషములు, భ్రాతృకారకుడు కుజునివలన సోదర విశేషములు, పుత్రకారకుడు గురువుద్వారా పుత్ర విశేషములు, మాతుల కారకుడు బుధునిద్వారా మేనమామ విశేషములు, శుక్రునిద్వారా కళత్ర విషయములు, శని ద్వారా సేవకుల విషయములు విచారింపవలెను.

# రాశి శీలాధ్యాయము

| | మేషం | వృషభం | మిథునం | కర్కాటకం | సింహం | కన్య |
|---|---|---|---|---|---|---|
| డిగ్రీలు | $0^0$ To $30^0$ | $30^0$ To $60^0$ | $60^0$To $90^0$ | $90^0$ To $120^0$ | $120^0$ To $150^0$ | $150^0$To $180^0$ |
| అధిపతి | కుజుడు | శుక్రుడు | బుధుడు | చంద్రుడు | రవి | బుధుడు |
| స్వభావం | చర | స్థిర | ద్విస్వభావం | చర | స్థిర | ద్విస్వభావ |
| తత్వం | అగ్ని | భూమి | వాయు | జల | అగ్ని | భూమి |
| వర్ణం | రక్త | శ్వేత | ఆకుపచ్చ | లేత ఎరుపు | ధూమ పాండు | చిత్రవర్ణం |
| శీర్ష/పృష్టోదయ | పృష్ఠ | పృష్ఠ | శీర్ష | పృష్ఠ | శీర్ష | శీర్ష |
| క్రూర/సౌమ్య | క్రూర | సౌమ్య | క్రూర | సౌమ్య | క్రూర | సౌమ్య |
| స్త్రీ/పురుష | పురుష | స్త్రీ | పురుష | స్త్రీ | పురుష | స్త్రీ |
| దిశ | తూర్పు | దక్షిణ | పశ్చిమ | ఉత్తర | తూర్పు | దక్షిణ |
| రాత్రిబల/ దినబల | రాత్రిబల | రాత్రిబల | రాత్రిబల | రాత్రిబల | దినబల | దినబల |
| జాతి | క్షత్రియ | వైశ్య | శూద్ర | బ్రాహ్మణ | క్షత్రియ | వైశ్య |
| అంగములు | శిరస్సు | ముఖము | భుజములు | హృదయం | కడుపు | కటి |
| సంచారప్రదేశం | చిన్నపర్వతాలు | గ్రామం | గ్రామం | వనము | అరణ్యము | పర్వతము |
| ప్రకృతి | పిత్త | వాత | త్రిధాతు | శ్లేష్మ | పిత్త | వాత |
| చింత | ధాతుచింత | మూలచింత | జీవచింత | ధాతుచింత | మూలచింత | జీవచింత |
| ENGLISHNAME | ARIES | TAURUS | GEMINI | CANCER | LEO | VIRGO |
| గుణము | రజ | రజ | తమః | సత్వ | సత్వ | తమః |

| | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం |
|---|---|---|---|---|---|---|
| డిగ్రీలు | $180^0$ To $210^0$ | $210^0$ To $240^0$ | $240^0$To $270^0$ | $270^0$ To $300^0$ | $300^0$ To $330^0$ | $330^0$To $360^0$ |
| అధిపతి | శుక్రుడు | కుజుడు | గురువు | శని | శని | గురువు |
| స్వభావం | చర | స్థిర | ద్విస్వభావం | చర | స్థిర | ద్విస్వభావ |
| తత్వం | వాయు | జల | అగ్ని | భూమి | వాయు | జల |
| వర్ణం | కృష్ణవర్ణం | సువర్ణం | కపిల | శుక్ల కపిల | నలుపుతో కలిసిన తెలుపువన్నె | స్వచ్ఛమైన |
| శీర్ష/పృష్ఠోదయ | శీర్ష | శీర్ష | పృష్ఠ | పృష్ఠ | శీర్ష | ఉభయోదయ |
| క్రూర/సౌమ్య | క్రూర | సౌమ్య | క్రూర | సౌమ్య | క్రూర | సౌమ్య |
| స్త్రీ/పురుష | పురుష | స్త్రీ | పురుష | స్త్రీ | పురుష | స్త్రీ |
| దిశ | పశ్చిమ | ఉత్తర | తూర్పు | దక్షిణ | పశ్చిమ | ఉత్తర |
| రాత్రిబల/ దినబల | దినబల | దినబల | రాత్రిబల | రాత్రిబల | దినబల | దినబల |
| జాతి | శూద్ర | బ్రాహ్మణ | క్షత్రియ | వైశ్య | శూద్ర | బ్రాహ్మణ |
| అంగములు | పొత్తికడుపు | మర్మాంగం | తొడలు | మోకాళ్ళు | పిక్కలు | పాదములు |
| సంచారప్రదేశం | భూమి | భూమి | భూమి | వనము | జలము | జలము |
| ప్రకృతి | త్రిధాతు | శ్లేష్మ | పిత్త | వాత | త్రిధాతు | శ్లేష్మ |
| చింత | ధాతుచింత | మూలచింత | జీవచింత | ధాతుచింత | మూలచింత | జీవచింత |
| ENGLISH NAME | LIBRA | SCORPIO | SAGITA RIOUS | CAPRI-CORN | AQUA RIOUS | PIECES |
| గుణము | రజ | రజ | సత్వ | తమః | తమః | సత్వ |

# గ్రహశీలాధ్యాయము

| * | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని | రాహు | కేతు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఉచ్ఛ | మేషం | వృషభం | మకరం | కన్య | కర్కాటకం | మీనం | తుల | వృష | వృశ్చి |
| ఉచ్ఛ భాగలు | 0 నుండి 10 | 0 నుండి 3 | 0 నుండి 28 | 0 నుండి 15 | 0 నుండి 5 | 0 నుండి 27 | 0 నుండి 20 | | |
| మూల త్రికోణ | సింహం | వృష | మేషం | కన్య | ధను | తుల | కుంభ | మిథునం | ధనస్సు |
| మూలత్రికోణభాగలు | 0నుండి 20వరకు | 4నుండి 30వరకు | 0నుండి 12వరకు | 16నుండి 20వరకు | 0నుండి 10వరకు | 0నుండి 15వరకు | 0నుండి 20వరకు | | |
| వర్ణం | రక్త | శ్వేత | ఎరుపు | గరిక | పసుపు వన్నె | తెలుపు | నలుపు | పొగ | చిత్ర |
| జాతి | క్షత్రియ | వైశ్య | క్షత్రియ | వైశ్య | బ్రాహ్మణ | బ్రాహ్మణ | శూద్ర | చండాల | మ్లేచ్ఛ |
| స్వభావం | క్రూర | సౌమ్య | క్రూర | సౌమ్య | సౌమ్య | సౌమ్య | క్రూర | క్రూర | క్రూర |
| లోహం | తామ్రం | మణి విశేషం | బంగారు | ఇత్తడి కంచు | వెండి | ముత్యం | ఇనుము సీసం | సీసం | నీల మణి |
| రత్నం | కెంపు | ముత్యం | పగడం | పచ్చ | పుష్యరాగం | వజ్రం | నీలం | గోమేధికం | వైఢూర్యం |
| తత్వం | సాత్విక | సాత్విక | తమః | రజో | సాత్విక | రజో | తమః | తమః | తమః |
| ధాన్యం | గోధుమ | బియ్యం | కందులు | పెసలు | శనగలు | బొబ్బర్లు | నువ్వులు | మినుము | అలచందలు |
| దిశ | దక్షిణ | ఉత్తర | దక్షిణ | తూర్పు | తూర్పు | ఉత్తర | పశ్చిమ | నైఋతి | |
| నీచ | తుల | వృశ్చికం | కర్కాట | మీనం | మకరం | కన్య | మేషం | వృశ్చిక | వృష |
| స్త్రీ/పుం | పురుష | స్త్రీ | పురుష | నపుం | పురుష | స్త్రీ | నపుం | స్త్రీ | నపుం |

| * | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని | రాహు | కేతు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఉపాసనా దేవతలు | శివ | పార్వతి | సుబ్రహ్మణ్యం | విష్ణు | బ్రహ్మ | లక్ష్మి | శివ | దుర్గ | గణపతి |
| ప్రకృతి | పిత్త | వాత కఫ | పిత్త | వాత పిత్త కఫ | కఫ | కఫ వాత | వాత | వాత | వాత |
| ప్రదేశం | దేవాలయం | జలాశయం | అగ్నిస్థానం | క్రీడాస్థలం | కోశాగారం | శయ్యాగృహం | మలిన ప్రాంతం | పుట్ట | పుట్ట |
| అవయవం | ఎముక | రక్తం | మజ్జ | చర్మం | మాంసమందు కొవ్వు | వీర్యం | నరములు చర్మం | | |
| రసము | కారము | ఉప్పు | చేదు | మిశ్ర రసం | తీపి | పులుపు | వగరు | | |
| కాల బల | దివా బలం | రాత్రి బల | రాత్రి బల | సర్వ బల | దివా బలం | దివా బలం | రాత్రి బల | | |
| వృక్షం | సారవంత వృక్షం | క్షీర వృక్షం | కటుక వృక్షం | ఫలరహిత వృక్షం | ఫల వృక్షం | పుష్ప వృక్షము | కుత్సిత వృక్షం | | |
| వస్త్రం | ఎర్ర వస్త్రం | తెల్ల వస్త్రం | ఎర్ర వస్త్రం | నల్ల వస్త్రం | పీతాంబరం | పట్టు వస్త్రం | చిత్ర వస్త్రం | చిత్ర వస్త్రం | ఛిద్ర వస్త్రం |
| చింత | మూల చింత | ధాతు చింత | ధాతు చింత | జీవ చింత | జీవ చింత | మూల చింత | ధాతు చింత | ధాతు చింత | జీవ చింత |
| మిత్ర | కుజ,గురు చంద్ర | రవి బుధ | రవి,గురు చంద్ర | రవి శుక్ర | రవి,చంద్ర కుజ | బుధ శని | శుక్ర బుధ | | |
| శత్రు | శని శుక్ర | లేరు | బుధ | చంద్ర | బుధ శుక్ర | రవి చంద్ర | రవి,కుజ చంద్ర | | |
| సమ | బుధ | శేషం | శుక్ర శని | కుజ,గురు శని | శని | కుజ,గురు | గురు | | |
| నృపాదుల | రాజా | రాజా | సేనాని | యువ రాజు | మంత్రి | మంత్రి | సేవక | | |
| పంచ భూతం | అగ్ని | జల | అగ్ని | పృథ్వి | ఆకాశ | జల | వాయు | | |

# షోడశవర్గులు

రాశి (1), హోర (2), ద్రేక్కాణ (3), చతుర్థాంశ (4),సప్తాంశ (7),నవాంశ (9), దశాంశ (10), ద్వాదశాంశ (12), షోడశాంశ (16), వింశాంశ (20), చతుర్వింశాంశ (24), భాంశము (27), త్రింశాంశ (30), ఖవేదాంశ (40), అక్షవేదాంశ (45),షష్ట్యంశ (60), అని మొత్తం 16 వర్గులు కలవు. పరాశరులు ఒక్కో అంశకు ఒక్కో పేరుతో ఉదహరించారు. వాటి వివరం క్రింద యివ్వబడినది.

**రాశి**

రాశికి మొత్తం ముప్పది భాగములు వుంటాయి. భచక్రం మొత్తమును $360^0$లుగా విభజించి అందు $0^0$నుండి $30^0$ వరకు మేషము $30^0$నుండి $60^0$వరకు వృషభము, $60^0$నుండి $90^0$వరకు మిథునం,$90^0$నుండి $120^0$వరకు కర్కాటకం,$120^0$నుండి $150^0$వరకు సింహం,$150^0$నుండి $180^0$వరకు కన్య,$180^0$నుండి $210^0$వరకు తుల,$210^0$నుండి $240^0$వరకు వృశ్చికం,$240^0$నుండి $270^0$వరకు ధనుః,$270^0$నుండి $300^0$వరకు మకరం,$300^0$నుండి $330^0$వరకు కుంభం,$330^0$నుండి $360^0$వరకు మీనంగా విభజించారు.

స్ఫుటగ్రహములను తీసుకొని ఆ గ్రహాలు ఎన్ని డిగ్రీలమీద వున్నవో చూచి ఆ డిగ్రీలు ఏరాశికి చెందినవో ఆ రాశిలో ఆ గ్రహాలను వేయాలి. ఉదాహరణకు రవి $186^0$ –30ని॥ మీద వున్నవనుకోండి. రవి కన్యను దాటి తులలో వున్నట్లు. ఈ విధంగా ప్రతి గ్రహమునకు రాశిచక్రంలో స్థానం సాధించవలెను.

## హోర

రాశిని రెండుభాగములు చేయగా అందు మొదటి పదిహేను భాగములు ఒక హోర. తర్వాత పదిహేను భాగములు రెండవహోర అవుతాయి.

$0^0$ నుండి $15^0$ మరియు$15^0$ నుండి$30^0$ హోర యొక్క భాగములు.

బేసిరాశులగు మేష,మిథున,సింహ,తుల,ధనుః,కుంభములలో మొదటి హోరకు రవి అధిపతి. రెండవహోరకు చంద్రుడు అధిపతి.

సరిరాశులగు వృష,కర్కాట,కన్య,వృశ్చిక,మకర,మీనములలో మొదటి హోరకు చంద్రుడు అధిపతి. రెండవహోరకు రవి అధిపతి అగును. ఈ హోర విషయంలో పాఠాంతరమలు వున్నను పరాశర మతమే అమలులో వున్నది.

ఓజరాశి = బేసిరాశి, యుగ్మరాశి = సరిరాశి

## హోరా చక్రము

| భాగ | మేష | వృష | మిథు | కర్క | సింహ | కన్య | తుల | వృశ్చి | ధను | మక | కుంభ | మీన |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 15 | రవి | చంద్ర | రవి | చంద్ర | రవి | చంద్ర | రవి | చంద్ర | రవి | చంద్ర | రవి | చంద్ర |
| 30 | చంద్ర | రవి | చంద్ర | రవి | చంద్ర | రవి | చంద్ర | రవి | చంద్ర | రవి | చంద్ర | రవి |

# ద్రేక్కాణము

రాశిత్రిభాగా ద్రేక్కాణా స్తేచ షట్త్రింశ దీరితాః
పరివృత్తి త్రయం తేషాం మేషాదేః క్రమశో భవేత్
స్వపంచనవమానాం చ రాశీనాం క్రమశ శ్చ తే ॥
నారదా గస్తి దూర్వాసా ద్రేక్కాణేశా శ్చరాదిషు ॥

ఒకరాశిని మూడు భాగములు చేయగా అందు మొదటి పదిభాగలు మొదటి ద్రేక్కాణం. అధిపతి లగ్నాధిపతి. రెండవ పదిభాగలు రెండవ ద్రేక్కాణం . పంచమాధిపతి ద్వితీయ ద్రేక్కాణాధిపతి. మూడవ పదిభాగలు మూడవ ద్రేక్కాణము. నవమాధిపతి తృతీయ ద్రేక్కాణాధిపతి అగుచున్నారు. ఈ ద్రేక్కాణ విషయములో అనేక మతాంతర పాఠములు వున్నవి. రెండవపాఠం ఈ విధంగా వున్నది.

" చరేస్వపుత్రనవపాః స్థిరేధర్మస్వపుత్రపాః పుత్రధర్మస్వపాద్విశ్వే ద్రేక్కాణస్య ప్రకీర్తితాః"

యివి రెండుపాఠములు బాగా అమలులో వున్నవి. అయితే నేను పరాశర పద్ధతిలో చక్రమును ఈ క్రింద యిచ్చుచున్నాను. ద్రేక్కాణ విషయంలో యింకా అనేక పాఠములు వున్నను అవి అమలులో లేవు.

$0^0$ - నుండి $10^{00}$-$00^{00}$। $10^{00}$-$00^{00}$ నుండి $20^{00}$-00" । $20^{00}$-00" నుండి $30^0$-00"। యివి ద్రేక్కాణ భాగలు. ఈ క్రింద యివ్వబడిన ప్రతిచక్రములోను మేషాది 12రాశులను ఒకటి ,రెండు, మూడు, నాలుగు సంఖ్యలతో చూపడమైనది.

## ద్రేక్కాణ చక్రము

| స్వామి | భాగ | మే | వృ | మి | క | సిం | కన్య | తు | వృ | ధ | మ | కుం | మీ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| నారద | 10 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| అగస్తి | 20 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 |
| దుర్వాస | 30 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |

## చతుర్థాంశము

స్వర్క్షాది కేంద్రపతయ స్తుర్యాం శేశాః క్రియాదిషు ।
సనకశ్చ సనందశ్చ కుమారశ్చ సనాతనః ॥

**తా** - రాశిని నాలుగు భాగములు చేయగా ఆ రాశి కేంద్రాలు నాలుగు వరుసగా నాలుగు చతుర్థాంశాలు అగును.

$0^0$ - నుండి 07'-30"। 07'-30" నుండి $15^0$-00" । $15^0$-00" నుండి 22'-30"। 22'-30" నుండి $30^0$ -00" యివి చతుర్థాంశ భాగములు.

## చతుర్థాంశ చక్రము

| స్వామి | భాగ | మే | వృ | మి | క | సిం | కన్య | తు | వృ | ధ | మ | కుం | మీ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సనక | 7.30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| ఆనంద | 15.0 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 |
| కుమార | 22.30 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| సనాతన | 30.0 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |

## సప్తమాంశము

సప్తాంశపా స్త్వోజగృహే గణనీయా నిజేశతః ।
యుగ్మరాశౌ తు విజ్ఞేయాః సప్తమర్క్షాదినాయకాత్ ॥
క్షార–క్షీరౌ చ దధ్యాజ్యౌ తథే క్షురససంభవ ః
మద్య శుద్ధజలా వోజే సమే శుద్ధజలాదికాః ॥

రాశిని ఏడు భాగములు చేయగా - ఓజరాశులలో ఆ రాశిమొదలు ఏడు రాశులు వరుసగా ఏడు సప్తాంశములు అగును. యుగ్మరాశులలో సప్తమరాశి మొదలు ఏడురాశులు వరుస సప్తాంశలు అగును. ఒక్కో సప్తాంశకు నాలుగు భాగల 17లిప్తలుండును.

## సప్తమాంశ చక్రము

| స్వామి | భాగలి | మే | వృ | మి | క | సిం | కన్య | తు | వృ | ధ | మ | కుం | మీ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్షార | 4-17 | 1 | 8 | 3 | 10 | 5 | 12 | 7 | 2 | 9 | 4 | 11 | 6 |
| క్షీర | 8-34 | 2 | 9 | 4 | 11 | 6 | 1 | 8 | 3 | 10 | 5 | 12 | 7 |
| దధి | 12-51 | 3 | 10 | 5 | 12 | 7 | 2 | 9 | 4 | 11 | 6 | 1 | 8 |
| ఆజ్య | 17-8 | 4 | 11 | 6 | 1 | 8 | 3 | 10 | 5 | 12 | 7 | 2 | 9 |
| ఇక్షురస | 21-25 | 5 | 12 | 7 | 2 | 9 | 4 | 11 | 6 | 1 | 8 | 3 | 10 |
| మద్య | 25-42 | 6 | 1 | 8 | 3 | 10 | 5 | 12 | 7 | 2 | 9 | 4 | 11 |
| శుద్ధజల | 30-0 | 7 | 2 | 9 | 4 | 11 | 6 | 1 | 8 | 3 | 10 | 5 | 12 |

## నవమాంశము

నవాంశేశా శ్చరే తస్మాత్ స్థిరే తన్నవమాదితః ।
ఉభయే తత్పంచమాదె రితి చింత్యం విచక్షణైః ॥

దేవా నృ రాక్షసా శ్చైవ చరాదిషు గ్రహేషుచ ॥

రాశిని తొమ్మిది భాగములు చేయగా ఒక్కొక్క భాగము మూడు భాగలు ఇరవై లిప్తలుండును. మేష, కర్కాటక, తులా, మకరములలో ఆ రాశినుండి వరుస తొమ్మిది రాశులు వరుస తొమ్మిది నవాంశలు అగును. వృషభ, సింహ,వృశ్చిక,కుంభములలో ఆ రాశినుండి తొమ్మిదవరాశి ప్రారంభ నవాంశ అయి వరుస తొమ్మిది రాశులు తొమ్మిది నవాంశలు అగును. మిథున, కన్యా, ధనుర్మీనముల విషయమై ఆ రాశికి అయిదవరాశి మొదటి నవాంశ అయి అక్కడ నుండి వరుస తొమ్మిది రాశులు వరుస తొమ్మిది నవాంశలు అగును.

## పరాశరమత నవాంశ చక్రము

| స్వామి | భా.లి | మే | వృ | మి | క | సిం | కన్య | తు | వృ | ధ | మ | కుం | మీ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| దేవ1 | 3-20 | 1 | 10 | 7 | 4 | 1 | 10 | 7 | 4 | 1 | 10 | 7 | 4 |
| నర2 | 6-40 | 2 | 11 | 8 | 5 | 2 | 11 | 8 | 5 | 2 | 11 | 8 | 5 |
| రాక్షస3 | 10-00 | 3 | 12 | 9 | 6 | 3 | 12 | 9 | 6 | 3 | 12 | 9 | 6 |
| దేవ4 | 13-20 | 4 | 1 | 10 | 7 | 4 | 1 | 10 | 7 | 4 | 1 | 10 | 7 |
| నర5 | 16-40 | 5 | 2 | 11 | 8 | 5 | 2 | 11 | 8 | 5 | 2 | 11 | 8 |
| రాక్షస6 | 20-00 | 6 | 3 | 12 | 9 | 6 | 3 | 12 | 9 | 6 | 3 | 12 | 9 |
| దేవ7 | 23-20 | 7 | 4 | 1 | 10 | 7 | 4 | 1 | 10 | 7 | 4 | 1 | 10 |
| నర8 | 26-40 | 8 | 5 | 2 | 11 | 8 | 5 | 2 | 11 | 8 | 5 | 2 | 11 |
| రాక్షస9 | 30-00 | 9 | 6 | 3 | 12 | 9 | 6 | 3 | 12 | 9 | 6 | 3 | 12 |

## దశమాంశము

దశమాంశా స్స్వత శ్చొజే యుగ్మే తన్నవమాత్ స్మృతాః ।

దశ పూర్వాదిదిక్పాలా ఇంద్రాగ్ని యమ రాక్షసాః ॥

వరణో మారుత శ్చైవ కుబేరేశాన పద్మజాః ।

అనంత శ్చ క్రమా దోజే సమే వావ్యుత్క్రమేణ తు॥

ఒక రాశిని పది భాగలు చేయగా ప్రతి దశాంశ మూడుభాగల వ్యాప్తి కలిగి వుంటుంది. బేసి రాశులకు ఆ రాశి నుండి వరుస పదిరాశులు వరుస దశాంశలు అగును. సరి రాశులలో ఆ రాశికి తొమ్మిదవ రాశి నుండి వరుస పది రాశులు వరుస దశాంశలు అగును.

# దశమాంశ చక్రము

| విషమ రాశి | భా | మే | వృ | మి | క | సిం | కన్య | తు | వృ | ధ | మ | కుం | మీ | సమ రాశి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఇంద్ర | 3.0 | 1 | 10 | 3 | 12 | 5 | 2 | 7 | 4 | 9 | 6 | 11 | 8 | అనంత |
| అగ్ని | 6.0 | 2 | 11 | 4 | 1 | 6 | 3 | 8 | 5 | 10 | 7 | 12 | 9 | బ్రహ్మ |
| యమ | 9.0 | 3 | 12 | 5 | 2 | 7 | 4 | 9 | 6 | 11 | 8 | 1 | 10 | ఈశాన |
| రాక్షస | 12.0 | 4 | 1 | 6 | 3 | 8 | 5 | 10 | 7 | 12 | 9 | 2 | 11 | కుబేర |
| వరుణ | 15.0 | 5 | 2 | 7 | 4 | 9 | 6 | 11 | 8 | 1 | 10 | 3 | 12 | వాయు |
| వాయు | 18.0 | 6 | 3 | 8 | 5 | 10 | 7 | 12 | 9 | 2 | 11 | 4 | 1 | వరుణ |
| కుబేర | 21.0 | 7 | 4 | 9 | 6 | 11 | 8 | 1 | 10 | 3 | 12 | 5 | 2 | రాక్షస |
| ఈశాన | 24.0 | 8 | 5 | 10 | 7 | 12 | 9 | 2 | 11 | 4 | 1 | 6 | 3 | యమ |
| బ్రహ్మ | 27.0 | 9 | 6 | 11 | 8 | 1 | 10 | 3 | 12 | 5 | 2 | 7 | 4 | అగ్ని |
| అనంత | 30.0 | 10 | 7 | 12 | 9 | 2 | 11 | 4 | 1 | 6 | 3 | 8 | 5 | ఇంద్ర |

# ద్వాదశాంశ చక్రము

| స్వామి | భా.లి | మేష | వృష | మిథు | కర్క | సింహ | కన్య | తుల | వృశ్చి | ధను | మక | కుంభ | మీన |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| గణేశ | 2-30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| అశ్వినీ | 5-0 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 |
| యమ | 7-30 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 |
| అహి | 10-00 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 |
| గణేశ | 12-30 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 |
| అశ్వినీ | 15-00 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 |
| యమ | 17-30 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| అహి | 20-00 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| గణేశ | 22-30 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| అశ్వినీ | 25-00 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| యమ | 27-30 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| అహి | 30-00 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |

# ద్వాదశాంశము

ద్వాదశాంశస్య గణనా తత్తత్క్షేత్రా ద్వినిర్దిశేత్ ।
తేషా మధీశాః క్రమశో గణేశాశ్వియమాహయః ॥

రాశిని పన్నెండు భాగలు చేయగా ఒక్కో షోడశాంశ వ్యాప్తి రెండుభాగల ముప్పది లిప్తలు అగును. ప్రతి రాశికి ఆ రాశినుండి వరుస పన్నెండు రాశులు పన్నెండు ద్వాదశాంశలు అగును.

## షోడశాంశ చక్రము

| సంఖ్య | విష స్వా | మే | వృ | మి | క | సిం | కన్య | తు | వృ | ధ | మ | కుం | మీ | సమ స్వామి | భా.లి-వి.లి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | బ్ర | 1 | 5 | 9 | 1 | 5 | 9 | 1 | 5 | 9 | 1 | 5 | 9 | సూర్య | 1-52-30 |
| 2 | వి | 2 | 6 | 10 | 2 | 6 | 10 | 2 | 6 | 10 | 2 | 6 | 10 | హర | 3-45-0 |
| 3 | హ | 3 | 7 | 11 | 3 | 7 | 11 | 3 | 7 | 11 | 3 | 7 | 11 | విష్ణు | 5-37-30 |
| 4 | సూ | 4 | 8 | 12 | 4 | 8 | 12 | 4 | 8 | 12 | 4 | 8 | 12 | బ్రహ్మ | 7-30-0 |
| 5 | బ్ర | 5 | 9 | 1 | 5 | 9 | 1 | 5 | 9 | 1 | 5 | 9 | 1 | సూర్య | 9-22-30 |
| 6 | వి | 6 | 10 | 2 | 6 | 10 | 2 | 6 | 10 | 2 | 6 | 10 | 2 | హర | 11-15-0 |
| 7 | హ | 7 | 11 | 3 | 7 | 11 | 3 | 7 | 11 | 3 | 7 | 11 | 3 | విష్ణు | 13-7-30 |
| 8 | సూ | 8 | 12 | 4 | 8 | 12 | 4 | 8 | 12 | 4 | 8 | 12 | 4 | బ్రహ్మ | 15-0-0 |
| 9 | బ్ర | 9 | 1 | 5 | 9 | 1 | 5 | 9 | 1 | 5 | 9 | 1 | 5 | సూర్య | 16-52-30 |
| 10 | వి | 10 | 2 | 6 | 10 | 2 | 6 | 10 | 2 | 6 | 10 | 2 | 6 | హర | 18-45-0 |
| 11 | హ | 11 | 3. | 7 | 11 | 3 | 7 | 11 | 3 | 7 | 11 | 3 | 7 | విష్ణు | 20-37-30 |
| 12 | సూ | 12 | 4 | 8 | 12 | 4 | 8 | 12 | 4 | 8 | 12 | 4 | 8 | బ్రహ్మ | 22-30-0 |
| 13 | బ్ర | 1 | 5 | 9 | 1 | 5 | 9 | 1 | 5 | 9 | 1 | 5 | 9 | సూర్య | 24-22-30 |
| 14 | వి | 2 | 6 | 10 | 2 | 6 | 10 | 2 | 6 | 10 | 2 | 6 | 10 | హర | 26-15-0 |
| 15 | హ | 3 | 7 | 11 | 3 | 7 | 11 | 3 | 7 | 11 | 3 | 7 | 11 | విష్ణు | 28-7-30 |
| 16 | సూ | 4 | 8 | 12 | 4 | 8 | 12 | 4 | 8 | 12 | 4 | 8 | 12 | బ్రహ్మ | 30-0-0 |

# షోడశాంశము

అజ సింహాశ్వితో జ్ఞేయా షోడశాంశా శ్చరాదిషు ।
అజ విష్ణూ హరః సూర్యో హ్యోజే యుగ్మే ప్రతీపకమ్ ॥

రాశిని 16భాగలు చేయగా ఒక్కో షోడశాంశ వ్యాప్తి ఒక భాగ 52 1/2 లిప్తలు అగును. అందు

తులా ప్రథమహోరయందు జన్మించిన గుండ్రని ముఖము, ఎత్తైనముక్కు, నల్లని పొడవగు నేత్రములు, విలాసములు, బలిసిన దేహము, ధనము, బంధువుల యెడ ప్రీతి గలవాఁడు, ద్వితీయహోరయందు జన్మించిన గొప్పధనము, నల్లని పొట్టివెంట్రుకలు, గుండ్రనికండ్లు, మంచి శరీరము, అల్పము లగు పాదాగ్రములు గలవాఁడునగును.

తులారాశియొక్క ప్రథమ ద్రేక్కాణమున జన్మించిన మన్మథునివలె సౌందర్యవంతుడు, మార్గమున పోవ నెఱిఁగిన వాఁడు, నల్లనివాఁడు, వర్తకమొనర్చువాఁడు, నియోగించుటయందు ధైర్యము గలవాఁడు, మేధావంతుఁడు నగును. ద్వితీయ ద్రేక్కాణమున జన్మించిన పద్మములవలె విశాలములైన నేత్రములు గలవాఁడు, మంచిరూపము వాగ్ధాటి సాహసము భూషణములు తన వంశమున పేరుగన్న పెద్దలననుసరించు గలవాఁడు నగును. తృతీయద్రేక్కాణమున జన్మించిన చపలచిత్తుఁడు, శఠుఁడు, కృతఘ్నుఁడు, కురూపి, కపటి, స్నేహితులు, ధనము, ప్రఖ్యాతి నశించిన వాఁడు, స్వల్పబుద్ధి గలవాఁడు నగును.

## వృశ్చిక లగ్నం

(జాతక పారిజాతము నుండి) మూర్ఖుడు, క్రూరదృష్టి కలవాడు, చంచల స్వభావి, గౌరవనీయుడు, చిరాయువు కలవాడు, ధనీ విద్వాంసుడు, సజ్జన ద్వేషి, విషాద విషయములలో ప్రియత్వం కలవాడు.(ఫలదీపిక నుండి) గుండ్రని తొడలు కలవాడు, విశాల ప్రస్ఫుట నేత్రములు కలవాడు, విశాల వక్షస్థలం కలవాడు, బాల్యావస్థ నుండి వ్యాధి పీడితుడు, రాజసమ్మానితుడు. (మానసాగరీ నుండి) వృద్ధ స్వభావుడు, క్రోధి.

వృశ్చిక పూర్వార్ధమున జన్మించిన ఎఱ్ఱనికొనలు కల్గి పచ్చనైన నేత్రములు, సాహసములైన పనులు, యుద్ధమున పరాక్రమము, చెడుప్రవర్తన గల స్త్రీయెడ ప్రేమ, ధనముగలవాఁడు, ద్వితీయహోర యందు జన్మించిన మిక్కిలి పొడవు, లావుగల శరీరము, రాజసేవ, చాల ఋణములు, స్నేహితులు, స్ఫుటమైన నేత్రములు గలవాఁడగును.

వృశ్చికలగ్నముయొక్క ప్రథమ ద్రేక్కాణమున జన్మించిన పచ్చని శరీరము గలవాఁడు, స్థిరమైన వాఁడు, మిక్కిలికోపము గలవాఁడు, యుద్ధమున గొప్పసామర్థ్యము గలవాఁడు, విశాలమగు నేత్రములు లావైనదియు పొడవైనదియు నగు శరీరము గల వాఁడు, కలియుగాచారములయందు, ప్రీతిగలవాఁడు నగును. ద్వితీయద్రేక్కాణమున జన్మించిన మృష్టాన్నము, పానీయములు, నిలకడలేని నేత్రములు, బంగారమువలె పచ్చనైన దేహము, సౌందర్యము, ఇతరులసొత్తు, మంచినడవడి మంచికళలు గలవాఁడగును. తృతీయద్రేక్కాణమున జన్మించిన గడ్డము మీసములు శరీరమున రోమములు లేనివాఁడు, ఘాతకుఁడు, పచ్చనికండ్లు గలవాఁడు, గొప్పకడుపు గలవాఁడు, ఇతరుల దండించువాఁడు, సోదరులనుండి విడిపోయినవాఁడు, బలిసిన బాహువులు గలవాఁడు, ధైర్యముగల హృదయము గలవాఁడు నగును.

# ధనుర్లగ్నం

(జాతక పారిజాతము నుండి) ప్రజ్ఞావంతుడు, కులశ్రేష్ఠుడు, ధనవంతుడు, యశస్వి, అభివృద్ధి త్వరగాపొందువాడు. (ఫలదీపిక నుండి) పొడుగాటి ముఖము, గొంతు కలవాడు, పెద్ద చెవులు,ముక్కు కలవాడు, తన కార్యములందే నిమగ్నమగువాడు, హ్రస్వ శరీరుడు, రాజప్రియుడు, బలాఢ్యుడు, దయాళువు. (మానసాగరీ నుండి) కార్య ప్రవీణుడు, దైవ, బ్రాహ్మణ ప్రియుడు.

ధనుర్లగ్న ప్రథమహోరయందు జన్మించిన నోటిపూఁత, వెడల్పగు రొమ్ము, చిన్ననేత్రములు, దవడలు గలవాఁడు, పసితనముననే తల్లిదండ్రులు లేనివాఁడు, తపస్సు చేయువాఁడునగును. ద్వితీయహోరయందు జన్మించిన పద్మములవంటి నేత్రములు, పొడవగు బాహువులు, శాస్త్రమున పరిచయము, మంచిదేహము, మాటలనేర్పు, ధన్యత గలవాఁడు, సౌఖ్యవంతుఁడు, కీర్తి గలవాఁడును అగును.

ధనుర్లగ్నముఒక్క ప్రథమద్రేక్కాణమున జన్మించిన గుండ్రనికండ్లు ముఖము మంచిగుణములు గలవాఁడు, స్వయముగ నభివృద్ధి నొందువాడు,. మంచి ఆచారములు, మార్దవము గలవాఁడు నగును. ద్వితీయద్రేక్కాణమున జన్మించిన శాస్త్రార్థమునెఱిఁగిన వాఁడు, మంచివక్త, మంత్రశాస్త్రవేత్తలలో అగ్రగణ్యుఁడు, అనేక తీర్థముల దేవాలయముల సంచరించువాఁడు నగును. తృతీయద్రేక్కాణమున జన్మించిన బంధువులలో ప్రాధాన్యము, నేర్పు సత్పురుషుల కాశ్రయుఁడు, ధర్మ పరాయణత, అభిమానము, ఇతర స్త్రీలతోటి పొత్తు, మంచిరూపము, యశస్సు, విజయము గలవాఁడు నగును.

# మకరలగ్నం

(జాతక పారిజాతము నుండి) రమణీలోలుడు, శఠారులు, దీనవాక్యములు పలుకువాడు. (ఫలదీపిక నుండి) శరీరంలో అధోభాగములు కృశించినవిగా కలవాడు. (మానసాగరీ నుండి) భయస్తుడు, యితరులను మోసగించువాడు, ధూర్తుడు, కఫ వాత ప్రకృతి కలవాడు.

మకర ప్రథమహోరయందు జన్మించిన నల్లనిదేహము, సింహమువంటి నేత్రములుగలవాఁడు, ధన్యుఁడు, స్త్రీలవలన జయింపఁబడనివాడు, ప్రసన్నరూపముగలవాఁడు, పోకిరి, సంపన్నుఁడు, మృష్టాన్నము నారగించువాడు, మంచిపనులనొనర్చువాఁడు, సన్నని పెద్దముక్కు గలవాఁడునగును. ద్వితీయహోరయందు జన్మించిన ఎర్రని కనుబొమలు గలవాఁడు, సోమరి, ఎల్లపుడు మార్గమున సంచరించు వాఁడు, మూర్ఖుఁడు, నల్లనిదియు అంతటను రోమములు గల్గిన దేహము, మిక్కిలి తీవ్రత, సాహసము, రౌద్రత గల పనులు గలవాఁడగును.

మకరలగ్నముయొక్క ప్రథమద్రేక్కాణమున జన్మించిన పొడవగు బాహువులు గలవాఁడు,

నల్లనివాఁడు, గొప్పకీర్తి గలవాఁడు, మంచిరూపము, కాంతిశౌర్యము గలవాఁడు, నవ్వుచు మాట్లాడువాఁడు, స్త్రీలవలన ఓడిపోవువాఁడు, అందమగు వ్యాపారములు ధనము గలవాఁడు నగును. ద్వితీయద్రేక్కాణమున జన్మించిన చిన్నముఖము చాపల్యము, స్త్రీ పరధనముల నపహరించుట, నేర్పు, సజ్జనుల నడుమడినెఱుగుట, దానము, దురంతములగు పాదములు గలవాఁడగును. తృతీయద్రేక్కాణమున జన్మించిన వాచాలత గలవాఁడు, మలినుఁడు, కృశించినవాఁడు, పొడవైన వాఁడు, తండ్రిలేనివాఁడు, విదేశగమనముల వలన దుఃఖముల నొందువాఁడు నగును.

## కుంభ లగ్నం

(జాతక పారిజాతము నుండి) మూర్ఖ మనస్సు, రతీకేళీ లోలుడు, కార్పణ్య స్వభావి, ధనవంతుడు అగును. (ఫలదీపిక నుండి) కుండాకార శరీరాకృతి కలవాడు, సుగంధప్రియ, పరధనాపేక్ష కలవాడు. (మానసాగరీ నుండి) స్థిర స్వభావి, వాత ప్రకృతి, జలక్రీడా ప్రియుడు, శిష్టాచారి, జన ప్రియుడు.

కుంభ ప్రథమహోరయందు జన్మించిన స్త్రీ మిత్రుల సౌఖ్యము గలవాఁడు, మృదువైనవాడు, కొలదిపాటి పుత్రులు, సద్గుణములు, శౌర్యము, సూర్యునివలె ఎఱ్ఱనగు దేహము, దేశాటనమున ప్రీతి, గలవాఁడగును. ద్వితీయహోరయందైన ఎఱ్ఱని నేత్రములు, చిక్కిన దేహములు గలవాఁడు, పొట్టివాఁడు, సోమరి, ప్రతిక్రియ యొనర్చువాఁడు, దుఃఖవంతుడు, లోభి, దుర్మార్గుఁడు అగును.

కుంభలగ్నముయొక్క ప్రథమద్రేక్కాణమున జన్మించిన స్త్రీలు, మానము, కీర్తి, రూపము, గొప్ప ప్రభావము గలవాఁడు, పొడవైనవాఁడు, కార్యములుఓపికతోఁ జేయువాఁడు, ధనవంతుఁడు, రాజసేవకుఁడు నగును. ద్వితీయద్రేక్కాణమున జన్మించిన లోభి, సమర్థుడు, మధురముగా మాటలాడువాఁడు పచ్చనిదేహము, పచ్చని భీకరములగు కండ్లు, పరిహాసముచేయు అలవాటు గలవాఁడు, ధాటిగలమాట గలవాఁడు, బుద్ధిమంతుడు, స్నేహితులు విరివిగాఁగలవాడు నగును. తృతీయద్రేక్కాణమున జన్మించిన పొడవైనవాఁడు, పోకిరి, ప్రతాపవంతుఁడు, పొట్టిచేతులు గలవాఁడు, పుత్రులవలన ధనమునొందువాఁడు, స్తబ్ధత గలవాఁడు, అసత్యము చెప్పువాఁడు, కపటి చీలిన నేత్రములు గలవాఁడు, సంభోగమున చతురుఁడు నగును.

## మీనలగ్నం

(జాతక పారిజాతము నుండి) సాధారణ రతివాంఛ కలవాడు, ఇష్టజనానుకూలుడు, తేజస్సు, బలము కలవాడు, ధనధాన్యములతో తులతూగు వాడు అగును. (ఫలదీపిక నుండి) నీరు ఎక్కువగా త్రాగువాడు, విద్యావంతుడు, సులోచనుడు, అదృష్టవంతుడు, కృతజ్ఞుడు అగును. (మానసాగరీ నుండి) పిత్త

ప్రకృతి, అతిక్రోధి.

మీనలగ్న ప్రథమహోరయందు పుట్టినవాడు పొట్టివాఁడు, మంచిసౌందర్యముగల దేహము, వెడల్పగు నొసలు, వక్షస్థలము, స్త్రీలయెడ ప్రీతి, గొప్పకీర్తి, కార్యముల పట్టుదల, శౌర్యము గలవాఁడగును. ద్వితీయహోరయందు జన్మించిన దాతృత్వము, పొడవగు ముక్కు, నేర్పు, చురుకైన బుద్ధి, శోభనకరములగు నేత్రములు, రాజప్రీతి, స్త్రీలకు ప్రియుడగుట, సౌందర్యము, మంచిమాటలు గలవాఁడగును.

మీనలగ్నముయొక్క ప్రథమద్రేక్కాణమున జన్మించిన తేనెవంటి పచ్చనికండ్లు గలవాఁడు, పచ్చనిశరీరము గలవాఁడు, సౌఖ్యవంతుఁడు, నీటియందు ప్రయాణముచేయువాఁడు, వినయవంతుఁడు నగును. ద్వితీయద్రేక్కాణమున జన్మించిన స్త్రీలను సేవించువాఁడు, మృష్టాన్నము నారగించువాఁడు, ఇతరులధనము ననుభవించువాఁడు, కాముకుఁడు, స్త్రీలయందు సత్పురుషులయందు ప్రేమ గలవాఁడు, వాగ్ధాటి గలవాఁడు నగును. తృతీయ ద్రేక్కాణమునందు జన్మించిన నల్లనివాఁడు, కళలయం దారితేరినవాఁడు, పెద్దపాదములు గలవాఁడు, మృష్టాన్నము దివ్యములగు పానీయములు గలవాఁడు, పరిహాస నిపుణుఁడు నగును.

**(జాతక పారిజాతంలోని విశేషములు)**

లగ్నము బేసిరాశి అయి రవి హోరయందున్న క్రూరస్వభావి, కాముకుడు, ధనవంతుడు, రాజపూజ్యుడు అగును. లగ్నము బేసిరాశియై చంద్ర హోరయందున్న వాక్పటుత్వముతో వున్నవాడు దాత సుందరశరీరుడు దయాళువు అగును.

సరిరాశులందు చంద్రహోరలో జన్మించినవాడు నిర్భీతవాక్యములు పలుకువాడు, నీరసుడు, పుణ్యస్త్రీ భార్యగా గలవాడగును. సరిరాశులందు రవి హోరలందు జన్మించినవాడు మంత్రీ, కృతజ్ఞతాస్వభావి, చపలచిత్తుడు, అతిభయ ప్రకృతి కలవాడగును.

**ద్రేక్కాణఫలము**

సింహ, మేష, కుంభ, వృశ్చిక మరియు మకర మొదటి ద్రేక్కాణములు మీన, వృశ్చిక, సింహ, తులాంత్య ద్రేక్కాణములు, కటక, వృశ్చిక, మధ్య ద్రేక్కాణములు, పాపద్రేక్కాణములని అందురు.

కర్మాటక ప్రథమ ద్రేక్కాణము, మీన ప్రథమ ద్రేక్కాణము కన్యామీన రాశుల మధ్య ద్రేక్కాణము, వృషభ మీనముల అంత్యద్రేక్కాణము ఈ ఆరును జలద్రేక్కాణములు.

మేషధనుర్వృషభ కుంభము మకరముల ద్వితీయద్రేక్కాణమును, ధనస్సు, కన్యా కుంభముల అంత్య ద్రేక్కాణములు అశుభ ద్రేక్కాణములందురు.

మకర మేష, కటకముల చరమ ద్రేక్కాణములును, వృషభ, ధనుస్సు, ప్రథమద్రేక్కాణమును, మిథునరాశి ద్వితీయ ద్రేక్కాణమును, మరియు తులా సింహముల మధ్య ద్రేక్కాణములును మిశ్రిత ద్రేక్కాణములని జ్యోతిర్విదులందురు.

పాపద్రేక్కాణమున జన్మించినవాడు కలమతి, తిరుగాడు స్వభావము కలవాడు, కార్యరతుడు, అపవాదములు పొందువాడగును. తోయధర ద్రేక్కాణమున జన్మించినవాడు దాత, భోగి, దయాళుడు, వ్యవసాయనిపుణుడు అగును. మరియు సౌశీల్యవంతుడు అగును. సౌమ్యద్రేక్కాణమున జన్మించినవాడు సుఖము, ధనము, పుత్రులు, సుందరరూపము, దయాస్వభావియగును. మిశ్రిత ద్రేక్కాణమున జన్మించిన దుష్టశీలుడు పరస్త్రీ రహితుడు క్రౌర్యదృష్టి కలవాడు చపల స్వభావగును.

ద్రేక్కాణవిషయమై బృహత్పరాశరీ హోరలో జన్మలగ్నము ప్రథమద్రేక్కాణములో వున్నప్పుడు లగ్నము శిరస్సు ద్వితీయ ద్వాదశములు, నేత్రములు, తృతీయ ఏకాదశములు కర్ణములు, చతుర్థదశములు ముక్కులు, పంచమనవములు కపోలములు, షష్ట అష్టములు హనువులు, సప్తమము ముఖము, ద్వితీయ ద్రేక్కాణమున జననం అయినప్పుడు లగ్నము కంఠము, ద్వితీయ ద్వాదశములు భుజము శిరస్సు, తృతీయ ఏకాదశములు పార్శ్వములు, పంచమ నవములు హృదయము, షష్ఠ అష్టములు రొమ్ము, సప్తమము నాభిప్రదేశమును తెలియజేయును.

తృతీయ ద్రేక్కాణమున జననం అయినచో లగ్నము పొత్తికడుపు, ద్వితీయము ద్వాదశము, లింగము, గుదము, తృతీయము ఏకాదశములు అండకోశములు, చతుర్థము దశమము , తొడలు, పంచమము నవమము , జానువులు, షష్ఠ అష్ఠములు జంఘములు, సప్తమము పాదములు

లగ్నమునకు వెనుక ఆరుభాగములు శరీరములోని వామభాగము. ముందు ఆరుభాగములు దక్షిణభాగము అగును.

### నవాంశఫలము

సూర్యనవాంశలో జన్మించిన జాతకుడు దుష్టస్వభావి, బలశాలి, సుతులు, ధనమూ కలవాడు, పింగళ వర్ణనేత్రుడు, కాముకుడు అగును. చంద్రనవాంశలందు జన్మించినవాడు భోగవంతుడు, పరస్త్రీ రతుడు, పండితుడు, పశుసంపద, ధనము కలిగియుండును. కుజాంశయందు జన్మించినవాడు కఠినకార్యములు చేయువాడు, చంచలస్వభావి, తిరుగాడువాడు, పిత్తరోగి, లుబ్ధుడు అగును. బుధ నవాంశయందు జన్మించిన త్యాగశీలుడు, విరాగవంతుడూ, సుకుమారతనూ విలాసము కలవాడు, ప్రఖ్యాతి వహించినవాడు, విద్యాయశస్సులు కలవాడగును.

గురునవాంశయందు జన్మించినవాడు బంగరురంగు కేశములు కలవాడు, శ్రేష్ఠమయినవాడు, ధీమంతుడు, రూపవంతుడు, మంత్రి, పాండిత్యప్రభచే ప్రసన్నవదనము కలవాడు, రాజప్రియుడగును. శుక్రనవాంశయందు జన్మించిన పరకామినీరతుడు, త్యాగపురుషుడు అగును. శని నవాంశయందు జన్మించినవాడు పాపాత్ముడు, ధనహీనుడు, పెనుదంతములు కలవాడు, రోగభూయిష్టుడగును.

### ద్వాదశాంశఫలము

మేషద్వాదశయందు జన్మించినవాడు దుష్టస్వభావి, చోరప్రవృత్తి, పాపకార్యములు కలవాడగును. వృషభద్వాదశాంశయందు జన్మించినవాడు స్త్రీలు ధనము కలవాడు, రోగపీడితుడగును. మిధున

ద్వాదశాంశలయందు సౌశీల్యుడైనను జూదరగును.

కర్కాటక ద్వాదశాంశయందు పుట్టిన దురాచారము లాచరించువాడు, సింహద్వాదశాంశయందు తపోసంపన్నుడు అగును. కన్యాద్వాదశాంశయందు జన్మించిన జూదరి, స్త్రీరతుడు అగును. తులా ద్వాదశాంశయందు జన్మించిన వాడు వ్యాపారము చేయువాడు, మహాధనవంతుడు అగును.

వృశ్చిక ద్వాదశాంశయందు జన్మించిన హత్యాప్రవృత్తి కలవాడు, విటుడు, చోరులనాయకుడు అగును. ధనూరాశి ద్వాదశాంశ యగుచుండ జన్మించిన పితృ, బ్రాహ్మణ, దేవతాభక్తి కలవాడగును. మకర ద్వాదశాంశయందు జన్మించిన సస్య సంపద కలవాడు, సేవకులు కలవాడు అగును. కుంభద్వాదశాంశ యందు జన్మించినవాడు ఖలుడగును. మీన ద్వాదశాంశయందు జన్మించిన ధనీ విద్యావంతుడు యగును.

## త్రింశాంశ ఫలము

కుజత్రింశాంశలో జన్మించినవాడు చపలచిత్తుడు, కాఠిన్యమగు పలుకులు కలవాడును. క్రౌర్యసమన్విత ఆలోచనా సరళి కలవాడగును. శనిత్రింశాంశయందు జన్మించిన తిరుగాడువాడు, మలినభావుడు అగును. గురుత్రింశాంశయందు జన్మించినవాడు ధనవంతుడు యగును. బుధత్రింశాంశయందు జన్మించినవాడు, ఉత్తమజనులన్న ప్రీతికలవాడు, బంధుజనులచే ఒప్పారువాడు నగును. శుక్రత్రింశాంశ యందు సుందరశరీరము కలవాడు, సుఖవంతుడగును.

## విశేష లగ్నగణన

### భావలగ్నం

సూర్యోదయ సమారభ్య ఘటికానాంతు పంచకమ్ ।
ప్రయాతి జన్మపర్యంతం భావలగ్న తదేవహి ॥
ఇష్టం ఘట్యాదికం భక్త్యా పంచభిర్భాదిజం ఫలమ్ ।
యోజ్య మోదయికే సూర్యే భావలగ్నం స్ఫుటంచతత్ ।

సూర్యోదయాది జననకాల ఘడియలను అయిదుచే భాగించగా వచ్చిన లబ్ధమును రాశ్యాది భాగలిప్తలుగా చేసి దానిని సూర్యోదయ స్ఫుటరవిలో కలుపగా భావలగ్నమువచ్చును.

**ఉదా :-** సూర్యోదయాది జననకాల ఘడియలు 19-50 జననతేదీన స్ఫుటరవి 1-4-40

(19-50) ÷ 5 = 3.. శేషము 4-50

(4-50) × 6/5 = 29 - 00

(1-4-40) +(3-29-00) = 5-3-40 భావలగ్నము.

## హోరాలగ్నం

తథా సార్ధ ద్విఘటికా మితా దర్కోదయా ద్విజ ।

ప్రయాతి లగ్నం తన్నామ హోరా లగ్నం ప్రచక్షతే ॥

ఇష్ట ఘట్యాదికం ద్విఘ్నం పంచాప్తం భాదికంచయత్ ।

యోజ్య మౌదయికే భానౌ హోరా లగ్నం స్ఫుటం హితత్ ॥

సూర్యోదయము నుండి ప్రతి రెండున్నర ఘడియలకు ఒక ఘటికాలగ్నం నడుచును. సూర్యోదయాది జననకాల ఘడియలను 2 చే గుణించి అయిదుచే భాగించగా వచ్చే రాశ్యాదికము సూర్యోదయ స్పష్టరవిలో కలుపగా హోరాలగ్నము వచ్చును.

సూర్యోదయాది జననకాల ఘడియలు 19 -50 స్ఫుటరవి = 1-4-40

[(19-50) × 2] ÷ 5 = 7-29-00

(1-4-40) +(7-29-00 ) = 9-3-40 = హోరా లగ్నము

## ఘటీలగ్న సాధన

సూర్యోదయాది జననకాల ఘడియ, విఘడియలలో ఘడియలను 12 చే భాగించి శేషమును తీసికొని రవి వున్న రాశికి తర్వాత రాశినుండి లెక్కించి అన్నవ రాశిలో ఘటీకాలగ్నము వేయవలెను.

**ఉదా :-** సూర్యోదయాది జననకాల ఘడియలు 19-50 అందు 12)19(1 శేషం 7. రవి వృషభంలో వున్నాడు. రవికి పక్కన రాశి మిథునం. మిథునముకు ఏడవ రాశి ధనస్సు. ధనస్సు ఘటీకాలగ్నం.

భావచక్రమందు గ్రహములు ఏ రాశులలో కలవో ఆ రాశులలోనే గ్రహములు వుంచి ఈ మూడు లగ్నములలో మూడు చక్రములు వేయవలెను.

## వర్ణద లగ్న సాధన

వర్ణద రాశిని బట్టి వర్ణద ధశను కట్టి ఆయుర్దాయ సాధన చెప్పుట యుక్తము.

బేసి లగ్నములయందు జన్మించిన వారి విషయంలో లగ్నమును మేషమునుండి గణించవలెను. సరిలగ్నములందు జనించిన వారి విషయంలో మీనమునుండి లగ్నము వరకు అపసవ్యముగా లెక్కింపవలెను.

ఓ జలగ్న ప్రసూతానాం మేషాదేర్గణ యేత్క్రమాత్

సమలగ్న ప్రసూతానాం మీనాదే రపసవ్యత ॥

తథైవ హోరా లగ్నంగణయి త్వా తతః పరమ్

తర్వాత హోరాలగ్నం వరకు గణించవలెను.

లగ్న హోరాలగ్నములు రెండును సరిసంఖ్యలు అయినను బేసి సంఖ్యలు అయినను కలపవలెను.

ఒకటి బేసిరాశి మరొకటి సరిరాశి అయనచో అధికసంఖ్యనుండి స్వల్ప సంఖ్యను తీసివేసి –శేషసంఖ్యను – బేసిలగ్నంలో జననమయిన వారి విషయంలో మేషాదిగాను సరిలగ్నంలో పుట్టిన వారి విషయంలో మీనాది అపసవ్యంగా గణించి శేషసంఖ్యము సమమగు రాశి ఎన్నవదో అన్నవరాశిలో వర్ణదలగ్నం వేయవలెను.

**ఇందులగ్నము**

( కాలామృతం నుండి )

అర్కాన్నాగ చట స్తనుర్జన నటః ఖేటాయనంస్యుః స్తనోశ్చంద్రా ద్భాగ్య
పయోః కళైక్యమిన హృచ్ఛిష్టం విధోర్య ద్గృహం ॥
తద్రాశౌతు విపాప శోభన ఖగే కోటీశ్వరం తన్వతే ।
చేత్ పాపేతు సహస్ర శః ఖలఖగే తుంగేపి కోటీశ్వరం

రవికి 30 కళలు, చంద్ర 16; కుజ 6, బుధ 8, గురు 10, శుక్ర 12, శనికి 1కళ లగ్నాత్ భాగ్యాధిపతి కళలు, చంద్రలగ్నాత్ భాగ్యాధిపుని కళలు కూడి 12చే భాగించగా వచ్చే శేషముఎంతో అన్నవ రాశిలో (చంద్రాత్) ఇందులగ్నం వుంచవలెను.

# దృష్టి విషయాధ్యాయము

" పశ్యంతి సప్తమాస్సర్వే శనిజీవకుజాః పునఃవిశేషశ్చ త్రిదశ త్రికోణ చతురష్టగాన్ " అనే విషయం అందరికీ తెలిసినదే.(సాధారణంగా అన్ని గ్రహములకు సప్తమదృష్టి వుంటుంది.)
అనగా గ్రహములు తాము వున్న రాశినుండి ఏడవరాశిని చూడడం అనేది సర్వసాధారణం, అయితే శని తను వున్న రాశినుండి మూడు పది రాశులను, గురువు తను వున్న రాశినుండి అయిదు, తొమ్మిది రాశులను, కుజుడు తను వున్న రాశినుండి నాలుగు, ఎనిమిది రాశులలో వున్న గ్రహములను చూచును.
అయితే ఈ విషయంలో పూర్తి పాఠాంతరములు కలవు. అవి ఏవనగా
" దశమతృతీయే నవపంచమే చతుర్థాష్టమే కళత్రంచ
పశ్యంతి పాదవృద్ధ్యా ఫలాని చైవం ప్రయచ్ఛంతి " (లఘుజాతకంలో)
అని వున్న దానిని ఆధారం చేసుకొని సర్వ గ్రహములు 3,4,5,6,7,8,9,10 రాశులను చూచును. అందు మూడు పది రాశులను పాదదృష్టితోను,అయిదు తొమ్మిదులను అర్ధదృష్టితోను, నాలుగు ఎనిమిదులను ముప్పాతిక దృష్టితోను, ఏడవరాశిని సంపూర్ణ దృష్టితోను వీక్షించెదరు.

**విశేషదృష్టి**

పూర్ణంపశ్యతి రవిజస్తృతీయ దశమే త్రికోణమపి జీవః
చతురస్రం భూమిసుతః సితార్క బుధహిమకరాః కళత్రంచ

అని వున్న కారణంగా శని తను వున్న స్థానం నుండి మూడు, పది రాశులను, గురువు అయిదు, తొమ్మిది రాశులను కుజుడు నాలుగు, ఎనిమిది రాశులను చూచును.

ఈ విషయంతో సమానముగనే జాతకపారిజాతముయందు కూడా వున్నది.

## రాశిదృష్టి విషయం

అధ మేషాది రాశీనాం చరాదీనాం పృధక్ పృధక్
దృష్టి భేదం ప్రవక్ష్యామి శృణుత్వం ద్విజసత్తమ
రాశయోభిముఖం విప్రతధా పశ్యంతి పార్శ్వ భే
యధాచరః స్థిరానేవం స్థిరః పశ్యతివై చరాన్
ద్వి స్వభావో వినాత్మానం ద్వి స్వబావాన్ ప్ర పశ్యతి
సమీపస్థం పరిత్యజ్య ఖేటాస్తత్ర గతాస్తధా
చరేషు సంస్థితా ఖేటాః పశ్యంతి స్థిర సంగతాన్
స్థిరేషు సంస్థితా ఏవం పశ్యంతి చరసంస్థితాన్
ఉభయస్థాన్తు సూర్యాద్యాః పశ్యంత్యుభయ సంస్థితాన్
నికటస్థం వినాఖేటాః పశ్యంతీ త్యయ మాగమః (బృహత్పరాశరీహోరా)

- చర, స్థిర, ద్విస్వభావము ఆధారంగా రాశిదృష్టిని చెప్పవలెను. మేషాది రాశులు తమకు అభిముఖంగా వున్న రాశులను పార్శ్వములయందు వున్న రాశులను చూచును.
- మేష, కర్కాట, తులా, మకర రాశుల విషయంలో తమకు సమీపాన వున్న స్థిరరాశిని వదిలి మిగిలిన స్థిరరాశులను చూచును.
- వృషభ, సింహ, వృశ్చిక, కుంభ రాశుల విషయంలో తమకు సమీపాన వున్న చరరాశులను వదిలి మిగిలిన చరరాశులను చూచును.
- మిథున, కన్యా, ధనుర్మీన రాశులు తమను వదిలి మిగిలిన ద్విస్వభావ రాశులను వీక్షించును.
- ఈ విధంగానే చరరాశిగత గ్రహములు సమీప స్థిరరాశిని వదిలి మిగిలిన స్థిరరాశులను చూచును.
- స్థిరరాశిగత గ్రహములు తమకు దగ్గరలోని చరరాశిని వదిలి మిగిలిన చరరాశులను చూచును.
- ద్విస్వభావమునందున్న గ్రహము తమ నివాస రాశిని వదిలి మిగిలిన ద్విస్వభావ రాశులను చూచును.

# భావచక్రగణితం

ప్రాచీన పద్ధతిలో భావ స్ఫుటము చేయు విధానమును వ్రాయుచున్నాము.

సూర్యోదయమునుండి సూర్యాస్తమయము వరకు వున్నకాలమును దినప్రమాణము అంటారు.

దినప్రమాణములో సగమును దినార్ధ అంటారు.

* రాజయోగాధ్యాయం మొత్తం భావచక్రం ఆధారంగా నిర్ణయింపవలెను. *

ఒక ఘడియకు 24 నిమిషములు., ఒకఘడియకు అరవై విఘడియలు.ఒకగంటకు అరవై నిమిషములు., రెండున్నరఘడియలు. ఒక నిమిషముకు రెండున్నర విఘడియలు. సూర్యోదయం నుండి ఎన్ని గంటల ఎన్ని నిమిషాలకు జననం అయ్యెనో గుణించి ఆ గంటలను నిమిషాలను 21/2 తో గుణించిన ఎడల సూర్యోదయాది జననకాల ఘడియలు వస్తాయి.

**"నతము" దీనినిసాధించు విధానము**

1 పగటియందు దినార్ధలోపు జననం అయ్యేనేని సూర్యోదయాది జననకాల ఘడియలను దినార్ధలోనుండి తీసివేయగా వచ్చిన ఘడియ, విఘడియలను నతము అందురు.

2 పగటయందు దినార్ధ దాటిన తర్వాత సూర్యాస్తమయం లోపు జననం అయిన సూర్యోదయాది జననకాల ఘడియలలో దినార్ధను తీసివేయగా వచ్చిన శేషం నతమగును.

3 రాత్రియందు అర్ధరాత్రిలోపుగా జననం అయ్యేనేని సూర్యాస్తమయాది జననకాల ఘడియలను దినార్ధములో తీసివేయగా వచ్చిన శేషం నతమగును.

4 రాత్రియందు అర్ధరాత్రి తర్వాత జననం అయ్యేనేని సూర్యాస్తమాయాది జననకాల ఘడియలలో దినార్ధము తీసివేయగా వచ్చిన శేషము నతమగును.

A.M సమయానికి చెందిన నతము పూర్వకపాల నతము. P.M. సమయానికి చెంది నతము పశ్చిమ కపాల నతము అగును.

జననకాల లగ్నస్ఫుటమే (అనగా డిగ్రీలు కట్టగా వచ్చినది) అదియే జన్మసఫట లగ్నము.

## జన్మలగ్నం స్ఫుటం చేయు విధానం

జన్మలగ్నమును జన్మలగ్న భుక్తిని విఘడియలలోకి మార్చుము.

ఒక రాశికి ముప్పది భాగలు కనుక (భుక్తి × 30) ÷ లగ్నప్రమాణం = స్ఫుటలగ్నమగును.

ఉదా :- వృషభలగ్నం జన్మలగ్నం

జన్మలగ్నభుక్తి 1ఘ - 10 వి = 70వి

వృషభలగ్నప్రమాణం = 5ఘ -02వి = 302విఘ

(70×30)÷302 = 6 (శేషము 208)

(208×60) ÷302 = 41

స్ఫుట జన్మలగ్నం రాశ్యాది 1-6-41

## నతమును భాగ.లిప్తలలోనికి మార్చుట

ఒక రోజుకు 60 ఘడియలు ఒకరాశికి ముప్పై భాగలు ఒకరోజుకు 12రాశులు జన్మలగ్నాలుగా సంచారం అవుతాయి. అనగా 12×30 = 720 భాగలు. అనగా ఒకరోజుకు 60ఘడియలు 720భాగలు ఒక ఘడియకు ఆరుభాగలు.

ఈ ప్రకారం నతము యొక్క ఘడియలను విఘడియలను ఆరుచే భాగింపగా నతముయొక్క

భాగలిప్తలు వస్తాయి.

## భావ సాధన

- పూర్వ కపాల నత భాగలిప్తలోను జననకాల స్ఫుటరవిలోనుండి తీసివేసిన యెడల దశమభావం వచ్చును.
- పశ్చిమ కపాల నతమయినచో స్ఫుటరవికి నతముయొక్క భాగలిప్తలను కలుపవలెను. కలుపగా వచ్చినది దశమభావము కలదు.

**మిగిలిన భావములు**

- జన్మలగ్నముకు ఆరురాశులు కలుపగా సప్తమ భావము వచ్చును. దశమ భావముకు ఆరురాశులు కలుపగా చతుర్థ భావము వచ్చును.
- చతుర్థభావములో తను భావము (లగ్నస్ఫుటము) తీసివేయగా వచ్చినదానిని ఆరుచేత భాగించగా షష్ఠ్యాంశము వచ్చును.
- తనుభావముకు షష్ఠ్యాంశము కూడగా తనుభావము ద్వితీయభావముల సంధి వచ్చును. ఆ వచ్చినదానికి మరల షష్ఠ్యాంశమును కూడగా ధనభావము వచ్చును. యధావిధిగా మిగిలిన భావములను కూడా చేయవలెను. ఈ విధంగా చేయగా ప్రతిభావముకు పూర్వమున ఒకసంధి పరమున ఒక సంధి వుండును.
- పూర్వసంధి ప్రారంభంలో భావము ప్రారంభం అయి పరసంధి అంతముతో భావము ఆఖరు అగును.
- పైన మనం గణించగా వచ్చిన స్ఫుటలగ్నము, చతుర్థభావము యివి అన్నియు భావ మధ్యమములే.
- ఒకరాశి స్ఫుటము అయిన తర్వాత గ్రహించవలసిన విషయం - ఒకరాశి ముప్పది భాగలు కానీ ఒక భావముకు కాదు.
- ఒకరాశిలో వున్న గ్రహం భావారంభమునకు ముందు భాగలలో వుంటే ముందురాశిలోను భావాంతముకు తర్వాత భాగలు వుంటే తర్వాత రాశిలోను వేసి భావచక్రం నిర్ణయించవలెను.
- జననకాల స్ఫుట లగ్నమునుండి స్ఫుటభావములను స్ఫుటగ్రహములను గ్రహించి భావచక్రం వేయవలెను.

# ఆరూఢ చక్రం వేయు విధానం

ఆరూఢ చక్రంలో తొమ్మిది భావములు పరిశీలనలో వుంటాయి. అవి లగ్నము, ద్వితీయము (కోశారూఢము), చతుర్థము (వాహనారూఢము), పంచమము (మంత్రారూఢము) సప్తమము (దారారూఢము) నవమము (భాగ్యారూఢము) దశమము (రాజ్యారూఢము) ఏకాదశము (లాభారూఢము) ద్వాదశము (ఉపపదము). ఆరూఢ చక్రము రాశిచక్రం ఆధారంగా గణించవలెను.

మనము మొదట ఏ ఆరూఢము కనుగొనవలెనో నిర్ణయించి ధానికి సంబంధిత భావఅధిపతి అభావము లగాయితు ఎన్నవ యింటవున్నారో చూసి అభావాధిపస్థిత రాశినుండి అన్నవరాశిలో ఆ ఆరూఢము వ్రాయాలి.

**ఉదాహరణ :-**

మేషలగ్నం అధిపతి కుజుడు సింహరాశిలో ఉన్నారు. లగ్నారూఢం గణితం చేయాలి. లగ్నమునుండి సింహం అయిదవ రాశి. సింహముకు అయిదవరాశి ధనుస్సు. ధనుస్సుకు లగ్నారూఢం వ్రాయాలి.

| కుజ | | | శని కేతు లగ్నం |
|---|---|---|---|
| చంద్ర | రాశి | | రవి బుధ శుక్ర |
| గురు | చక్రం | | |
| రాహు | | | |

| | మంత్ర | వాహన | |
|---|---|---|---|
| లాభ దార | ఆరూఢ | | |
| | చక్రం | | లగ్నం |
| | రాజ్య | భాగ్య | కోశ ఉపపదం |

# గ్రహ సమయములు

మేషాది జన్మ లగ్నము వరకు లెక్కించి సంఖ్యను కనుగొని యే గ్రహ సమయం కనుగొన వలెనో ఆ గ్రహం మేషం లగాయితు ఎన్నవ రాశియందున్నాడో ఆ సంఖ్యను పై సంఖ్యచే గుణించి లబ్ధమును గ్రహ వత్సరములచే గుణించి 27 చే భాగించిన వచ్చిన శేషము సమయమగును.

1 **స్నాన సమయము** – మంచి కుటుంబము, సంతానము, మర్యాద, జయము, గొప్ప స్థితి కలుగును.

2 **వస్త్రధారణ సమయము** – రత్నము, ధనము, అధికారము, వస్త్రములు కలుగును.

3 **పుండ్ర ధారణ సమయము** – జన ప్రియత్వము,పరదేశమునందు లాభం,పాటు పడుట, మర్యాద కలుగును.

4 **ఉపదేశ సమయము** – భూమి, వాహన లాభము, సౌఖ్యము కలుగును.

5 **శివ పూజా సమయము** – భూములయందు ప్రీతి, రాజకోపము, ధన వ్యయము, వ్యాజ్యములు కలుగును.

6 **ఆపోశన సమయము** – ధనము, జన ప్రియత్వము, క్రూరులకు యిష్టుడు అగును.

7 విష్వర్చన సమయము - విత్తము, దుఃఖము, విద్యా ప్రావీణ్యము కలుగును.

8 విప్రారాధన సమయము - భాగ్యము, భూములలో లాభము, శత్రువులకు అపజయము, ధనవంతులగు బంధువులు కలుగును.

9 నమస్కార సమయము - మృదు వాక్కు, మంచి వాహనము, ఉభయ పక్ష వాది అగును.

10 అద్రి ప్రదక్షిణ సమయము - పైత్య రోగము, అతి సారము, మేజిస్ట్రేటు కేసులు,జరిమానాలు కలుగును.

11 వైశ్వ దేవ సమయము - రాచ కార్యములయందధికారము, మంచి కుటుంబము, దినదిన వర్ధమాన జీవనము కలుగును.

12 అతిథి సత్కార సమయము - మోసము,గారడీ విద్య, నిధి లాభం కలుగును.

13 భోజన సమయము - మోసగాడు, రోగిష్టి, కుల భ్రష్టుడు అగును.

14 అంభఃపాన సమయము - చెడు భోజనము, నీచ కృత్యములు చేయును.

15 అహంకార సమయము - జన విరోధి, అన్నియు తనకే తెలియును అనుట కల్గును.

16 తాంబూల సమయము - గొప్ప ఉద్యోగము, విద్యా ప్రావీణ్యత, విశేష ధనము, ఖ్యాతి గల్గును.

17 నృపాలాప సమయము - మర్యాద, గంగిగోవు, దైవగుణానుభవము కల్గును.

18 కిరీట ధారణ సమయము - గొప్ప సేనాధికారం, విద్యా ప్రావీణ్యత, ధనముకలుగును.

19 ఏకాంత సంభాషణ సమయము - సోమరి, మృదువాక్కు, ఉభయ పక్ష వాది యగును.

20 అలసత్వ సమయము - విద్యా భంగము,సోమరి, మాంద్యము, అజాగ్రత్త కలుగును.

21 శయన సమయము - అతి కోపము, రోగము, కుటుంబ జనములో పోట్లాట కలుగును.

22 అమృత పాన సమయము - అవివేకము, స్నేహితులకు కీడు చేయుట, పెద్దలను దూషించుట, వినాశము కలుగును.

23 మధుర సమయము - ఆరోగ్యము,మంచి సంతానము, చక్కని భార్య, బంధువులతో మర్యాద, మృష్టాన్నము కలుగును.

24 ధనార్జన సమయము - మర్యాద, విశేష ధనలాభము, కార్య దురంధరత్వము కలుగును.

25 భిక్షాటన సమయము - కార్య నష్టము, దుర్బోధ కలుగును.

26 నిద్రా సమయం - దీర్ఘ రోగము, రాజ కోపము,మధుపానం కల్గును.

27 సంభోగ సమయం - నీచ స్త్రీ లోలత్వము, దురాలోచన, విచారము, కపటము కలుగును. అనుమానం, పగ దీర్చుకొనుట కలుగును.

# షడ్బల వివరము

(బృహత్పరాశరీ శ్రీపతి, కేశవ జాతకముల ఆధారముగా)

1) స్థానబలము, 2) దిగ్బలము, 3) కాల బలము, 4) దృగ్బలము, 5) చేష్టా బలము, 6) నైసర్గిక బలము వీటిని అన్నింటిని కలిపి షడ్బలములు అందురు.

## 1. స్థానబలము

ఉచ్ఛబలం, సప్తవర్గజ బలం, ఓజయుగ్మ రాశ్యంశబలం, కేంద్రబలం, & ద్రేక్కాణ బలం, వీటిని అన్నింటినీ కలిపి స్థానబలంగా నిర్ధారించాలి.

**ఉచ్ఛబలం**

నీచోన్నంతు గ్రహం సార్ధార్థికే చక్రాద్విశోధయేత్

భాగీకృత్య త్రిభిర్భక్తం ఫలముచ్ఛ బలం భవేత్ ॥

ఏ గ్రహముకు ఉచ్ఛబలం కనుగొనదలిచితిమో ఆ గ్రహము ఉన్న స్థితిని రాశ్యాదిగా గ్రహించి ఆ గ్రహము యొక్క పరమ నీచభాగను తీసి వేయగా శేషము ఆరురాశులకు ($180^0$) తక్కువ వుండెనేని దానినే మూడుచే భాగించాలి. లేని ఎడల 12 రాశులలో ($360^0$లలో) తీసివేసి మిగిలిన శేషమును 3 చే భాగించవలెను. అదే స్థానబలము.

**ఉదాహరణ 1**

స్ఫుటరవి - 10రా 10భా 20లిప్తలు రవికి పరమనీచ భాగలు 6 రా 10భాగలు

(10-10-20) -(6-10-0) = 4-00-20

(4-00-20) ÷ 3 = 1-10-6 (ఉచ్ఛబలము)

**ఉదాహరణ 2**

స్ఫుటచంద్రుడు 5-19-19 పరమనీచ భాగలు చంద్రునకు రాశ్యాది 7-3-00

(5-19-19) -(7-3-00) = 10-16-19

(12-10-00) - (10-16-19) = (1-23-41)

(1-23-41) ÷3 = 17-54 (ఉచ్ఛబలము)

**శ్రీపతి విధానంలో**

నీచనోద్యుచరోధికో యదిభవేత్ షడ్భృస్తదాప్రచ్ఛు తశ్చక్రాచ్ఛుద్ధకలాః ఖఖాష్టకకు భిర్భక్తం బలం తుంగజమ్ ॥

గ్రహం యొక్క పరమనీచ భాగలలలోనుండి తీయగా వచ్చిన ఫలాన్ని 10800తో భాగించగా

ఆరు రాశులలో తక్కువగా ఉండెనేని ఆ రాశులనే కలలుగా మార్చవలెను. ఆరురాశులకు అధికంగా వున్న ఎడల 12 రాశులలోనుండి తీసివేసి కలలుగా మార్చవలెను.

ఉదా1 :- స్ఫుటరవి 10-10-20 పరమనీచ భాగ 6-10-0

(10-10-20) - (6-10-0) = 4-0-20

(4×30×60) +20 = 7220

(7220 ×60)÷10800 = 40 ఉచ్ఛబలము

ఉదా2 :- స్ఫుటరవి (5-15-16) పరమనీచ భాగలు (6-10-0)

(05-15-16) -(6-10-0) = 11-5-16

రాశ్యాధికంగా వున్న కారణంచేత

(12-0-0) -(11-5-16) = 00-24-44

{(24×60) +44}× 60]÷10800 = 8 ఉచ్ఛబలము

కేశవ జాతకపద్ధతి యందు పరాశర మతాధారంగానే ఉచ్ఛబలం చెప్పబడినది.

**స్థానబలమందలి మూలత్రికోణాది బలము**

మూలత్రికోణ స్వర్క్షాధిమిత్ర మిత్రసమారిషు ।
శతృగృహే చాపి స్థితానాం క్రమశో బలమ్ ।
భూతాబ్దయః స్వరామాశ్చ నఖాస్దిది బిర్ధిశోయుగాః ॥

మూలత్రికోణములో ఉన్న గ్రహమునకు 0-45 విరూపములను స్వక్షేత్రస్థిత గ్రహముకు 0-30 విరూపములు అధిమిత్ర క్షేత్రమున్న వున్న గ్రహమునకు 0.22 1/2 విరూపములు మిత్రక్షేత్రమున వున్న గ్రహమునకు 0-15 విరూపములు, సమ క్షేత్రమున వున్న గ్రముకు 0.7 1/2 విరూపములు శతృక్షేత్రమున వున్న గ్రహమునకు 0.33/4 విరూపములు అధిశతృ క్షేత్రమున వున్న గ్రహముకు 0.1.52 1/2

పై విలువలు శ్రీపతియందు కూడా సమముగానే యివ్వబడినవి.

**ఓజయుగ్మ రాశిబలము**

యుగ్మరాశుల నవాంశలయందు గానీ, యుగ్మరాశులయందు గానీ, చంద్రశుక్రులు వుండిరేని, యుగ్మరాశులయందు వున్నందుకు 0-15 విరూపములు యుగ్మరాశి నవాంశలయందు వున్నందుకు 0-15 విరూపముల బలము వుండును. మిగిలిన గ్రహములకు ఓజరాశుల బలము వుండును.

ద్వా విందు శుక్రౌ యుగ్మాంశో తిథిరోజాంశగాః పరే ॥ (పరాశరులవారు )
(శ్రీపతి) యుగ్మ భాంశక గతౌ శశి శుక్రౌ యచ్ఛతో హి బలపాద మయుగ్మే ।
భాంశకే ర్కకుజ జీవ శనిజ్ఞా స్తావదేవ వితరంతి హిసర్వే ॥

## కేంద్రాదిస్థ బలం

(పరాశరః) కేంద్రాదిషు స్థితా లగ్నాత్షష్టిట స్త్రింశ త్తిథిః క్రమాత్

(శ్రీపతిః) కంటకాద్యుప గతేషుచ యోజ్యావీర్యే రూపకార్ధ చరణానిఖవేర్యా

కేంద్రముల యందు వున్న గ్రహములకు ఒక రూపబలము పణఫరములయందు వున్న గ్రహములకు 0-30 విరూపములు, ఆపోక్లీబములయందు వున్న గ్రహములకు 0-15 విరూపములు బలము వుండును.

## కేంద్రాది సంజ్ఞ

| | | |
|---|---|---|
| లగ్నాత్ | 1-4-7-10 స్థానములు | కేంద్రములు |
| లగ్నాత్ | 2-5-8-11స్థానములు | ఫణఫరములు |
| లగ్నాత్ | 3-6-9-12స్థానములు | ఆపోక్లీబములు |
| లగ్నాత్ | 1-5-9స్థానములు | కోణములు |
| లగ్నాత్ | 3-6-10-11స్థానములు | ఉపచయ స్థానములు |

## తాత్కాలిక మిత్ర శతృత్వములు

భవంతి తాత్కాలిక మిత్ర భూతా స్సర్వేచవాక్సోదర బంధుయుక్తాః

స్వస్వాత్క్రుమా ద్వ్యుత్క్రుమ తస్తదైవ మన్యస్థితా స్తత్సమయా రిభూతాః

అన్ని గ్రహములకు తామున్న రాశికి 1,2,3,4,10,11,12 స్థానములలో వున్న గ్రహములు తాత్కాలిక మిత్రులు. 5,6,7,8,9 స్థానములయందున్న గ్రహములు తాత్కాలిక శత్రువులు.

తత్కాల మిత్రంతు నిసర్గమిత్రం ద్వయం భవేతత్వధి మిత్రసంజ్ఞం

తదైవ శతృస్వధి శతృసంజ్ఞ ఏకత్ర శతృస్సమతా ముపైతి

ఏ గ్రహముకైనను నైసర్గికంగాను, తాత్కాలికంగాను మిత్రత్వం వున్న ఎడల దానిని అధిమిత్ర గ్రహంగా పరిగణించాలి. తాత్కాలిక శతృత్వం నైసర్గిక మిత్రత్వం వున్నా తాత్కాలిక మిత్రత్వం నైసర్గిక శత్రుత్వం వున్నా సముడుగా పరిగణించాలి.

## ద్రేక్కాణ బలము

ఆది మధ్యావసానేషు ద్రేక్కాణేషు స్థితాఃక్రమాత్ ।

పున్నపుంసకయేషా ఖ్యాదద్యు స్థితి బలం గ్రహాః ।(పరాశర)

పురుష గ్రహము ప్రథమ ద్రేక్కాణమున వున్న 0-15 విరూపముల బలము స్త్రీ గ్రహము అంత్య ద్రేక్కాణమున వున్న 0-15 విరూపముల పాద బలమును నపుంసక గ్రహము మధ్య ద్రేక్కాణమున వున్న 0-15 విరూపముల పాదబలమును పొందును.

యిది పూర్తి స్థానబల వివరము

ఒక రూపముకు 60 విరూపములు. ఒక విరూపముకు 60 పరలు. ఒక పరకు 60 సురలు. ఒక రాశికి 30 భాగలు. ఒక భాగకు 60 లిప్తలు. ఒక లిప్తకు 60 విలిప్తలు.

## 2. దిగ్బలం.

సూర్యాత్ కుజాత్ సుఖం జీవాత్ జ్ఞాచ్చాస్తం లగ్నమార్కితః ।

మధ్య లగ్నం భృగోశ్చంద్రాత్ హిత్యాషడ్భా ధికేసతి ॥ (పరాశర)

బుధుడు, గురువు జన్మ లగ్నమును పొంది పూర్వ దిశస్థులపై పూర్తి బలమును పొందుదురు. దశమ భావము దక్షిణము. దక్షిణదిశను పొందిన రవికుజులు దశమ భావగతులై పూర్ణ బలవంతులు అగుదురు.

లగ్నాత్ సప్తమ భావము పశ్చిమము. సప్తమ రాశిలో పశ్చిమ దిశస్థుడైన శని పూర్ణ బలవంతుడు. లగ్నాత్ చతుర్థము ఉత్తరము చంద్ర శుక్రులు ఉత్తర దిశలో నాల్గవ రాశిలో వుండి పూర్తి దిగ్బలము పొందుతారు. అయితే పైన చెప్పబడిన రాశులకు ఏడవ రాశిలో బలశూన్యులు అగుదురు. మిగిలిన రాశుల విషయంలో శ్రీపతి కూడా ఈ క్రింది విధంగానే చెప్పిరి.

రవి కుజుల బలమును కనుగొను విషయంలో వారి రాశ్యాది నుండి చతుర్థ భావమును తీసివేసి దానిని (ఎ) అనుకోండి. శేషము ఆరురాశులకు తక్కువ వుండెనేని దానినే లిప్తలుగా చేయవలెను. ఆరురాశులకు ఎక్కువగా వుండెనేని తీసివేయగా వచ్చిన రాశ్యాది (ఎ) ని 12 రాశులనుండి తీసివేసి శేషమును లిప్తలుగా చేయవలెను. ఆ లిప్తలను 10800చే భాగించగా రవికుజుల దిగ్బలము వచ్చును. యిదేవిధంగా బుధగురువుల బలమును కనుగొను విషయంలో సప్తమ భావమును చంద్రశుక్రుల బలమును కనుగొనునప్పుడు దశమభావమును శనిబలము కనుగొన్నప్పుడు శనిలో లగ్న భావము తీసివేసి దిగ్బల సాధన చేయవలెను.

## 3. కాలబలము

కాలబలము నతోన్నత బలము, పక్షబలము త్రిభాగ బలము, వర్షాధిపబలము, ముసబలము, వార బలము, హోరాబలము, ఆయన బలము, యుద్ధ బలము అని తొమ్మిది రకములు కలవు.

**(ఎ)నతోన్నత బలము** :- చంద్ర,కుజ,శనులు రాత్రియందు బలముకలిగి వుంటారు. బుధుడు రోజు అంతా బలం కలిగి యుంటాడు. రవి,శుక్ర,గురువులు పగలు బలం కలిగి వుంటారు. పరాశరులవారిని అనుసరించిన నతోన్నత బలము

భావచక్రంలో చెప్పిన విధంగా నతోన్నత సాధన చేసి 2 చే గుణించిన చంద్రవర్గంలోని గ్రహములకు బలసాధన అగును.

చంద్రవర్గ నతబలము 60 నుండి తీసివేయగా = రవివర్గ నతోన్నత బలము అగును.

శ్రీపతి ప్రకారం చంద్ర,కుజ,శనులు అర్ధరాత్రి బలవంతులు. మిట్టమధ్యాహ్నం బలశూన్యులు. అలాగే రవి,గురు,శుక్రులు అర్ధరాత్రి బలశూన్యులు అగుదురు. మిగిలిన కాలవిషయమై నతోన్నత ఘడియలను విఘడియలలోకి మార్చి దానిని ఆరుచే గుణించగా అసువులు వచ్చును. దానిని 180చే భాగించగా రాత్రి బలగ్రహముల షష్ట్యంశ (విరూపములు) సాధన అగును.

60 - నతం = ఉన్నతం.

ఉన్నతమును అసువులలోకి మార్చి 180 చే భాగించగా పగటి బలగ్రహముల షష్ట్యంశ సాధన అగును.

### (బి) పక్షబలము

పరాశర సిద్ధాంతం ప్రకారం

(చంద్ర - రవి) / 3 = పక్షబలం

యిది చంద్ర,బుధ,గురు,శుక్రులది స్ఫుటచంద్రునిలో నుండి రవిని తీయునపుడు ఆరురాశులకు పైగా వచ్చిన ఎడల ఆ లబ్దమును 12 రాశులలోనుండి తీసివేయవలెను.

పైన చేసిన గణితంలో వచ్చిన ఫలితమును అంతా తీసివేయగా రవి కుజ శనుల బలము అగును.

### (సి) త్రిభాగ బలము

పరాశరుల వారి ప్రకారము పగటిని మూడు భాగములు చేయగా వరుస మూడు భాగములకు బుధ రవి శనులును, రాత్రిని మూడు భాగములు చేయగా చంద్ర శుక్ర కుజులును వరుసగా బలవంతులు అగుచున్నారు. గురువు రోజంతా బలవంతుడే.

వర్షాధిప, మాసాధిప,వారాధిప,హోరాధిప బలం విషయంలో పరాశరులు

వర్షామాస దినేశానాం తిథిత్రింశ చ్ఛరార్ణవాః

హోరేశస్య బలం షష్ఠిరుక్తం నైసర్గికంపురా

వర్షాధిపతి 15 విరూపములు, మాసాధిపతికి 30 విరూపములు, వారాధిపతికి 45 విరూపములు, హోరాధిపతికి 60 విరూపములు కలుపవలెను.

శ్రీపతి ప్రకారం జనన సంవత్సరంలో సౌర వర్షాధిపతి అనగా మేష సంక్రమణ వారాధిపతి వర్షాధిపతిగా పరిగణించాలి. అలాగే మాసాధిపతి కూడా జనన సమయానికి రవి ఏ రాశిలో వుంటారో ఆ రాశికి సంబంధించిన మాసాధిపతి. జననకాలంలో ఏ వారం అయితే వుండునో ఆ గ్రహవారమే వారాధిపతి.

## హోర విషయం

రవి,శుక్ర,బుధ,చంద్ర,శని,గురు,కుజులు వరుసగా 24 గంటలకు 24 హోరలు వుండును.సూర్యోదయానికి ఆదివారం రవిహోర ప్రారంభం, సోమవారం చంద్రహోర ప్రారంభం,

మంగళవారం కుజహోర ప్రారంభం, బుధవారం బుధహోర ప్రారంభం, గురువారం గురుహోర ప్రారంభం, శుక్రవారం శుక్రహోర ప్రారంభం, శనివారం శనిహోర ప్రారంభం.

ప్రారంభసమయం సూర్యోదయము. దీనిని బట్టి జననం ఏ హోరలో అయినదో ఆ హోరాధిపతికి 60 విరూపముల బలం కలుపవలెను.

**అయనబలము**

రవ్యాది సాయనగ్రహములో భుజమును సాధించి పరమాపక్రమజ్యనయగు 1397చే గుణించి త్రిజ్యయగు 3438తో భాగించగా క్రాంతి వచ్చును. దానికి ధనువియ్యగా క్రాంతి అగును. సాయనగ్రహం ఆరురాశులలోపు వున్న ఉత్తర క్రాంతి ఆరురాశుల పైన వున్న దక్షిణ క్రాంతి అని అర్థము. (శ్రీపతి నుండి)

రవి,కుజ,గురు,శుక్రులకు ఉత్తరక్రాంతి అయిన పరమాపక్రమాజ్యలో కలుపవలెను. దక్షిణక్రాంతి అయిన తీసివేయవలెను. బుధునకు ఏ క్రాంతి అయినను కూడవలెను.

చంద్రశనులకు ఉత్తరక్రాంతి అయిన తీసివేయవలెను. దక్షిణక్రాంతి అయిన కూడవలెను. అలా చేయగా వచ్చిన మొత్తమును 3చే గుణించి 1397చే భాగించిన రాశ్యాది వచ్చును. శేషమును 30చే గుణించి 1397చే భాగించిన భాగలు వచ్చును. శేషమును 60చే గుణించి 1397చే భాగించిన లిప్తలు వస్తాయి. ఆ రాశ్యాది భాగలిప్తలను లిప్తలలోకి మార్చి 10800చే భాగించిన రూపాదిగా ఆయన బలం వచ్చును.

**యుద్ధబలం**

ఏదేని రెండుగ్రహములు ఒక డిగ్రీలోపల కలిసి వుంటే గ్రహయుద్ధం వుంటుంది. యుద్ధం రవిచంద్రులకు మాత్రం వుండదు.

రవితో చంద్రాది గ్రహములు చేరినపుడు అస్తమయం కలుగును.

చంద్రునితో కుజాది పంచగ్రహములు చేరినపుడు సమాగమము కలుగును.

కుజాది పంచగ్రహములతో ఏ రెండు గ్రహములు కలిసినను యుద్ధం కలుగును.

శ్రీపతి :- ఏ రెండు గ్రహాలకు గ్రహయుద్ధం గణితం నిర్ణయింపదలచావో, ఆ రెండు గ్రహములయొక్క స్థానాది షడ్బలము గణించి (స్థాన,దిక్, కాలబలంతో హోరాబలం వరకు). ఆ గణించగా వచ్చిన రెండు గ్రహముల రూపాదిని రెండింటియొక్క బలవ్యత్యాసమును ఉత్తరదిశలో వున్న రాశితోయుద్ధంలో (ముందుగా వున్న) గ్రహం నుండి తీసివేయవలెను. వెనుక వున్న గ్రహమును కలుపవలెను.

## 4.దృగ్బలము

సౌమ్యై ర్దృష్టే దృష్టి తుర్యాంశ యుక్తం వీర్యం పాపాలోకతే తద్విహీనః (శ్రీపతి నుండి)

పరాశర సిద్ధాంతం ప్రకారం శుభగ్రహదృష్టి యోగములందు 1/4 రూపమును కూడవలెను

అనియు పాపగ్రహ దృష్టియందు 1/4 రూపమును తీసివేయవలెను అనిరి. శ్రీపతి విధానము కూడా దీనికి సమానముగానే వున్నది.

## 5.చేష్టా బలము

రవికి ఆయనబలము చేష్టా బలము ఒకటే.

చంద్రునికి పక్ష బలము చేష్టా బలము ఒకటే.

ఉత్తరాయణమున రవి దక్షిణాయనమున చంద్రుడు, కుజాది గ్రహములు వక్రగతిలో వున్నపుడు బలవంతులు గ్రహయుద్ధమున గోళమున ఉత్తరమున వుండి జయించిన గ్రహము క్రాంతియుక్తుడై బలవంతుడగును.

వక్రముకు 60 కలలు, అనువక్రముకు 30 కలలు, వికలగతికి 15 కలలు, మందగతికి 30 కలలు, మందతర గతికి 15 కలలు, సమముకు 7 1/2 కలలు, చరగతికి 45 కలలు, అతిచరగతికి 30 కలలు వుండును. బృహజ్జాతకంలో వరాహమిహిరులు

ఉదగయనే రవిశీతమయూఖౌ వక్రసమాగమగాః పరిశేషాః

విపులకరాయు ధిచోత్తర సంస్థా శ్రేష్టిత వీర్యయుతాః పరికల్ప్యాః

దీనికి భట్టొత్పలుల వ్యాఖ్యలో "ఉదగయనే ఉత్తరాయణే రవిశీతమయూ ఖౌ సూర్యాచంద్ర మసౌ బలినోభవన్తి " అని వివరించిరి.

రవిచంద్రులు ఉత్తరాయణములో బలవంతులు. కుజ బుధ, గురు,శుక్ర,శనులు వక్రములో బలవంతులు. వీరు వక్రించినపుడు చంద్రునితో కలిసినపుడు కూడా బలవంతులే.

" శీఘ్రకేంద్రద్వితీయ పదస్థగ్రహస్య విపులరకత్వం ప్రాయఃసంభవంతి "

గ్రహములు శీఘ్రకేంద్రమందు ద్వితీయ పాదములు వుండగా విపులకిరణ గ్రహము అగును. విపులకిరణ గ్రహములు బలవంతులు. ఒక్క శుక్రుడు మాత్రము దక్షిణ దిగ్భాగమున వున్నప్పటికీ బలవంతుడే.

## 6. నైసర్గిక బలము

మందావనీసూను శశాంక పుత్ర వాగీశ శుక్రేందు దివాకరాణాం, ఏకోత్తరం

రూప మగ్రైర్విభక్తం నైసర్గికం వీర్యముదాహరంతి

రవికి 60 విరూపములు, చంద్రునికి 51.43 విరూపములు, శుక్రునికి 42.85 విరూపములు, గురువుకు 34.28 విరూపములు, బుధునికి 25.70 విరూపములు , కుజునికి 17.14, శనికి 8.57 విరూపములు నైసర్గిక బలము వుండును.

# ఉప అధిపతి (Sub-Lord)

K.P సిస్టమ్‌లో Sub-Lord వివరం మీద ఫలితాంశములు చెప్పబడతాయి. అందువలన ఈ Sub Lord ను గణించే విధానం కూడా తెలుసుకుందాం. ఒక్కో రాశికి $30^0$ లలో మొత్తం 12 రాశులకు $360^0$ యివ్వబడ్డాయి.ఒక్కో రాశికి తొమ్మిది పాదాలు (నక్షత్ర సంబంధంగా) వుంటాయి. అనగా ఒక్కో పాదమునకు 3 డిగ్రీల 20 నిమిషాలు వుంటాయి. ఒక నక్షత్రానికి 3 నాలుగు పాదములు వుంటాయి. 13 డిగ్రీల 20నిమిషాలు వుంటాయి.ఒక నక్షత్రానికి ఏ నక్షత్రమునకు అయితే Sub Lord గణిస్తున్నామో ఆ నక్షత్ర దశావత్సరములతో గుణించి 120తో భాగించగా గ్రహముకు సంబంధించి డిగ్రీలు సెకండ్లు వస్తాయి.

| | | | డిగ్రీలు | నిమిషాలు | సెకండ్లు |
|---|---|---|---|---|---|
| కేతు | అశ్విని,మఘ,మూల | 13.20×7/120 | $0^0$ | 46' | 40 |
| శుక్ర | భరణి, పుబ్బ,పూషా | 13.20×20/120 | $2^0$ | 13' | 20" |
| రవి | కృత్తి,ఉత్తర,ఉషా | 13.20×6/120 | $0^0$ | 40' | 00" |
| చంద్ర | రోహి,హస్త,శ్రవణం | 13.20×10/120 | $1^0$ | 06' | 40" |
| కుజ | మృగ,చిత్త,శని | 13.20×7/120 | $0^0$ | 46' | 40" |
| రాహు | ఆర్ద్ర,స్వాతి,శత | 13.20×18/120 | $20^0$ | 00' | 00" |
| గురు | పున,విశా,పూభా | 13.20×16/120 | $1^0$ | 46' | 40" |
| శని | పుష్య,ఉభా,అను | 13.20×19/120 | $2^0$ | 06' | 40" |
| బుధ | ఆశ్రేష,జ్యేష్ఠ,రేవతి | 13.20×17/120 | $01^0$ | 53' | 20" |
| మొత్తం | | | 13 | 201' | 00" |

అంతర్దశల మాదిరిగానే ప్రతి నక్షత్రమునకు ఆ నక్షత్ర దశానాధునిS u b D i v i s i o nతో ప్రారంభం అవుతుంది. ఉదాహరణకు శతభిషం నక్షత్రం అందలి ఉపఅధిపతులు ప్రారంభం రాహువుతో అయ్యి కుజునితో ముగుస్తుంది. $13^0$-20' నక్షత్ర దశా కాలమును Sub Division చేయుటను పరిశీలిస్తే Sub Division అంతర్దశా పరిమితి అవుతుంది. ఈ గణితంలో రాశ్యాధిపతి , నక్షత్రాధిపతి, ఉప అగిపతిగా ముగ్గురు వస్తారు. అందులో నక్షత్రాధిపతి పరిమితి దశను ఉప అధిపతి పరిమితి అంతర్దశను చూపతాయి. రవి, గురు నక్షత్రాలలో రాహు Sub Division రవిలోను,గురు Sub Division చంద్రలోను అదనంగా వస్తాయి. అనగా ఆరు Sub Divisions ఎక్కువ వస్తాయి. మొత్తం 249 Sub Divisions . ఈ Sub Division గణితం క్రింద ఈయబడినది.

| మేష | Deg-Min-Sec | | Deg-Min-Sec | రాశ్యాధిపతి | నక్షత్రాధిపతి | ఉప అధిపతి |
|---|---|---|---|---|---|---|
| 1. | $00^0$-00'-00" | to | $00^0$-46'-40" | కుజ | కేతు | కేతు |
| 2 | $00^0$-46'-40" | to | $03^0$-00'-00" | కుజ | కేతు | శుక్ర |
| 3 | $03^0$-00'-00" | to | $03^0$-40'-00" | కుజ | కేతు | రవి |
| 4 | $03^0$-40'-00" | to | $04^0$-46'-00" | కుజ | కేతు | చంద్ర |
| 5 | $04^0$-46'-00" | to | $05^0$-33'-20" | కుజ | కేతు | కుజ |
| 6 | $05^0$-33'-20" | to | $07^0$-33'-20" | కుజ | కేతు | రాహు |
| 7 | $07^0$-33'-20" | to | $09^0$-20'-00" | కుజ | కేతు | గురు |
| 8 | $09^0$-20'-00" | to | $11^0$-26'-40" | కుజ | కేతు | శని |
| 9 | $11^0$-26'-40" | to | $13^0$-20'-00" | కుజ | కేతు | బుధ |
| 10 | $13^0$-20'-00" | to | $15^0$-33'-20" | కుజ | శుక్ర | శుక్ర |
| 11 | $15^0$-33'-20" | to | $16^0$-13'-20" | కుజ | శుక్ర | రవి |
| 12 | $16^0$-13'-20" | to | $17^0$-20'-00" | కుజ | శుక్ర | చంద్ర |
| 13 | $17^0$-20'-00" | to | $18^0$-06'-40" | కుజ | శుక్ర | కుజ |
| 14 | $18^0$-06'-40" | to | $20^0$-06'-40" | కుజ | శుక్ర | రాహు |
| 15 | $20^0$-06'-40" | to | $21^0$-53'-20" | కుజ | శుక్ర | గురు |
| 16 | $21^0$-53'-20" | to | $24^0$-00'-00" | కుజ | శుక్ర | శని |
| 17 | $24^0$-00'-00" | to | $25^0$-53'-20" | కుజ | శుక్ర | బుధ |
| 18 | $25^0$-53'-20" | to | $26^0$-40'-00" | కుజ | శుక్ర | కేతు |
| 19 | $26^0$-40'-00" | to | $27^0$-20'-00" | కుజ | రవి | రవి |
| 20 | $27^0$-20'-00" | to | $28^0$-26'-40" | కుజ | రవి | చంద్ర |
| 21 | $28^0$-26'-40" | to | $29^0$-13'-20" | కుజ | రవి | కుజ |
| 22 | $29^0$-13'-20" | to | $30^0$-00'-00" | కుజ | రవి | రాహు |

| వృషభ | | | | రాశ్యాధిపతి | నక్షత్రాధిపతి | ఉప అధిపతి |
|---|---|---|---|---|---|---|
| 23 | $C0^0$-00'-00" | to | $01^0$-13'-20" | శుక్ర | రవి | రాహు |
| 24 | $01^0$-13'-20" | to | $03^0$-00'-00" | శుక్ర | రవి | గురు |
| 25. | $03^0$-00'-00 | to | $05^0$-06'-40" | శుక్ర | రవి | శని |
| 26. | $05^0$-06'-40" | to | $07^0$-00'-00" | శుక్ర | రవి | బుధ |
| 27. | $07^0$-00'-00" | to | $07^0$-46'-40" | శుక్ర | రవి | కేతు |
| 28. | $7^0$-46'-40" | to | $10^0$-00'-00" | శుక్ర | రవి | శుక్ర |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 29. | $10^{0}$-00'-00" | to | $11^{0}$-06'-40" | శుక్ర | చంద్ర | చంద్ర |
| 30. | $11^{0}$-06'-40" | to | $11^{0}$-53'-20" | శుక్ర | చంద్ర | కుజ |
| 31. | $11^{0}$-53'-20" | to | $13^{0}$-53'-20" | శుక్ర | చంద్ర | రాహు |
| 32. | $13^{0}$-53'-20" | to | $15^{0}$-40'-00" | శుక్ర | చంద్ర | గురు |
| 33. | $15^{0}$-40'-00" | to | $17^{0}$-46'-40" | శుక్ర | చంద్ర | శని |
| 34. | $17^{0}$-46'-40" | to | $19^{0}$-40'-00" | శుక్ర | చంద్ర | బుధ |
| 35. | $19^{0}$-40'-00" | to | $20^{0}$-26'-40" | శుక్ర | చంద్ర | కేతు |
| 36. | $20^{0}$-26'-40" | to | $22^{0}$-40'-00" | శుక్ర | చంద్ర | శుక్ర |
| 37. | $22^{0}$-40'-00" | to | $23^{0}$-20'-00" | శుక్ర | చంద్ర | రవి |
| 38. | $23^{0}$-20'-00" | to | $24^{0}$-06'-40" | శుక్ర | కుజ | కుజ |
| 39. | $24^{0}$-06'-40" | to | $26^{0}$-06'-40" | శుక్ర | కుజ | రాహు |
| 40. | $26^{0}$-06'-40" | to | $27^{0}$-53'-20" | శుక్ర | కుజ | గురు |
| 41. | $27^{0}$-53'-20" | to | $30^{0}$-00'-00" | శుక్ర | కుజ | శని |

| మిథునం | | | | రాశ్యాధిపతి | నక్షత్రాధిపతి | ఉప అధిపతి |
|---|---|---|---|---|---|---|
| 42. | $00^{0}$-00'-00" | to | $01^{0}$-53'-20" | బుధ | కుజ | బుధ |
| 43. | $01^{0}$-53'-20" | to | $02^{0}$-40'-00" | బుధ | కుజ | కేతు |
| 44. | $02^{0}$-40'-00" | to | $04^{0}$-53'-20" | బుధ | కుజ | శుక్ర |
| 45. | $04^{0}$-53'-20" | to | 0 $5^{0}$-33'-20" | బుధ | కుజ | రవి |
| 46. | $05^{0}$-33'-20" | to | $06^{0}$-40'-00" | బుధ | కుజ | చంద్ర |
| 47. | $06^{0}$-40'-00" | to | $08^{0}$-40'-00" | బుధ | రాహు | రాహు |
| 48. | $08^{0}$-40'-00" | to | $10^{0}$-26'-40" | బుధ | రాహు | గురు |
| 49. | $10^{0}$-26'-40" | to | $12^{0}$-33'-20" | బుధ | రాహు | శని |
| 50. | $12^{0}$-33'-20" | to | $14^{0}$-26'-40" | బుధ | రాహు | బుధ |
| 51. | $14^{0}$-26'-40" | to | $15^{0}$-13'-20" | బుధ | రాహు | కేతు |
| 52. | $15^{0}$-13'-20" | to | $17^{0}$-26'-40" | బుధ | రాహు | శుక్ర |
| 53. | $17^{0}$-26'-40" | to | $18^{0}$-6'-40" | బుధ | రాహు | రవి |
| 54. | $18^{0}$-06'-40" | to | $19^{0}$-13'-20" | బుధ | రాహు | చంద్ర |
| 55. | $19^{0}$-13'-20" | to | $20^{0}$-00'-00" | బుధ | రాహు | కుజ |
| 56. | $20^{0}$-00'-00" | to | $21^{0}$-46'-40" | బుధ | గురు | గురు |
| 57. | $21^{0}$-46'-40" | to | $23^{0}$-53'-20" | బుధ | గురు | శని |
| 58. | $23^{0}$-53'-20" | to | $25^{0}$-46'-40" | బుధ | గురు | బుధ |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 59. | 25°-46'-40" | to | 26°-33'-20" | బుధ | గురు | కేతు |
| 60. | 26°-33'-20" | to | 28°-46'-40" | బుధ | గురు | శుక్ర |
| 61. | 28°-46'-40" | to | 29°-26'-40" | బుధ | గురు | రవి |
| 62. | 29°-26'-40" | to | 30°-00'-00" | బుధ | గురు | చంద్ర |
| కర్కాటకం | | | | రాశ్యాధిపతి | నక్షత్రాధిపతి | ఉప అధిపతి |
| 63. | 00°-00'-00" | to | 00°-33'-20" | చంద్ర | గురు | చంద్ర |
| 64. | 00°-33'-20" | to | 01°-20'-00" | చంద్ర | గురు | కుజ |
| 65. | 01°-20'-00" | to | 03°-20'-00" | చంద్ర | గురు | రాహు |
| 66. | 03°-20'-00" | to | 05°-26'-40" | చంద్ర | శని | శని |
| 67. | 05°-26'-40" | to | 07°-20'-00" | చంద్ర | శని | బుధ |
| 68. | 07°-20'-00" | to | 08°-06'-40" | చంద్ర | శని | కేతు |
| 69. | 08°-06'-40" | to | 10°-20'-00" | చంద్ర | శని | శుక్ర |
| 70. | 10°-20'-00" | to | 11°-00'-00" | చంద్ర | శని | రవి |
| 71. | 11°-00'-00" | to | 12°-06'-40" | చంద్ర | శని | చంద్ర |
| 72. | 12°-06'-40" | to | 12°-53'-20" | చంద్ర | శని | కుజ |
| 73. | 12°-53'-20" | to | 14°-53'-20" | చంద్ర | శని | రాహు |
| 74. | 14°-53'-20" | to | 16°-40'-00" | చంద్ర | శని | గురు |
| 75. | 16°-40'-00" | to | 18°-33'-20" | చంద్ర | బుధ | బుధ |
| 76. | 18°-33'-20" | to | 19°-20'-00" | చంద్ర | బుధ | కేతు |
| 77. | 19°-20'-00" | to | 21°-33'-20" | చంద్ర | బుధ | శుక్ర |
| 78. | 21°-33'-20" | to | 22°-13'-20" | చంద్ర | బుధ | రవి |
| 79. | 22°-13'-20" | to | 23°-20'-00" | చంద్ర | బుధ | చంద్ర |
| 80. | 23°-20'-00" | to | 24°-06'-40" | చంద్ర | బుధ | కుజ |
| 81. | 24°-06'-40" | to | 26°-06'-40" | చంద్ర | బుధ | రాహు |
| 82. | 26°-06'-40" | to | 27°-53'-20" | చంద్ర | బుధ | గురు |
| 83. | 27°-53'-20" | to | 30°-00'-00" | చంద్ర | బుధ | శని |
| సింహం | | | | రాశ్యాధిపతి | నక్షత్రాధిపతి | ఉప అధిపతి |
| 84. | 00°-00'-00" | to | 00°-46'-40" | రవి | కేతు | కేతు |
| 85. | 00°-46'-40" | to | 03°-00'-00" | రవి | కేతు | శుక్ర |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 86. | 03$^0$-00'-00" | to | 03$^0$-40'-00" | రవి | కేతు | రవి |
| 87. | 03$^0$-40'-00" | to | 04$^0$-46'-40" | రవి | కేతు | చంద్ర |
| 88. | 04$^0$-46'-40" | to | 05$^0$-33'-20" | రవి | కేతు | కుజ |
| 89. | 05$^0$-33'-20" | to | 07$^0$-33'-20" | రవి | కేతు | రాహు |
| 90. | 07$^0$-33'-20" | to | 09$^0$-20'-00" | రవి | కేతు | గురు |
| 91. | 09$^0$-20'-00" | to | 11$^0$-26'-40" | రవి | కేతు | శని |
| 92. | 11$^0$-26'-40" | to | 13$^0$-20'-00" | రవి | కేతు | బుధ |
| 93. | 13$^0$-20'-00" | to | 15$^0$-33'-20" | రవి | శుక్ర | శుక్ర |
| 94. | 15$^0$-33'-20" | to | 16$^0$-13'-20" | రవి | శుక్ర | రవి |
| 95. | 16$^0$-13'-20" | to | 17$^0$-20'-00" | రవి | శుక్ర | చంద్ర |
| 96. | 17$^0$-20'-00" | to | 18$^0$-06'-40" | రవి | శుక్ర | కుజ |
| 97. | 18$^0$-06'-40" | to | 20$^0$-06'-40" | రవి | శుక్ర | రాహు |
| 98. | 20$^0$-06'-40" | to | 21$^0$-53'-20" | రవి | శుక్ర | గురు |
| 99. | 21$^0$-53'-20" | to | 24$^0$-00'-00" | రవి | శుక్ర | శని |
| 100. | 24$^0$-00'-00" | to | 25$^0$-53'-20" | రవి | శుక్ర | బుధ |
| 101. | 25$^0$-53'-20" | to | 26$^0$-40'-00" | రవి | శుక్ర | కేతు |
| 102. | 26$^0$-40'-00" | to | 27$^0$-20'-00" | రవి | రవి | రవి |
| 103. | 27$^0$-20'-00" | to | 28$^0$-26'-40" | రవి | రవి | చంద్ర |
| 104. | 28$^0$-26'-40" | to | 29$^0$-13'-20" | రవి | రవి | కుజ |
| 105. | 29$^0$-13'-20" | to | 30$^0$-00'-00" | రవి | రవి | రాహు |

| కన్య | | | | రాశ్యాధిపతి | నక్షత్రాధిపతి | ఉప అధిపతి |
|---|---|---|---|---|---|---|
| 106. | 00$^0$-00'-00" | to | 01$^0$-13'-20" | రవి | రవి | రాహు |
| 107. | 01$^0$-13'-20" | to | 03$^0$-00'-00" | రవి | రవి | గురు |
| 108. | 03$^0$-00'-00" | to | 05$^0$-06'-40" | రవి | రవి | శని |
| 109. | 05$^0$-06'-40" | to | 07$^0$-00'-00" | రవి | రవి | బుధ |
| 110. | 07$^0$-00'-00" | to | 07$^0$-46'-40" | రవి | రవి | కేతు |
| 111. | 07$^0$-46'-40" | to | 10$^0$-00'-00" | రవి | రవి | శుక్ర |
| 112. | 10$^0$-00'-00" | to | 11$^0$-06'-40" | రవి | చంద్ర | చంద్ర |
| 113. | 11$^0$-06'-40" | to | 11$^0$-53'-20" | రవి | చంద్ర | కుజ |
| 114. | 11$^0$-53'-20" | to | 13$^0$-53'-20" | రవి | చంద్ర | రాహు |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 115. | $13^0$-53'-20" | to | $15^0$-40'-00" | రవి | చంద్ర | గురు |
| 116. | $15^0$-40'-00" | to | $17^0$-46'-40" | రవి | చంద్ర | శని |
| 117. | $17^0$-46'-40" | to | $19^0$-40'-00" | రవి | చంద్ర | బుధ |
| 118. | $19^0$-40'-00" | to | $20^0$-26'-40" | రవి | చంద్ర | కేతు |
| 119. | $20^0$-26'-40" | to | $22^0$-40'-00" | రవి | చంద్ర | శుక్ర |
| 120. | $22^0$-40'-00" | to | $23^0$-20'-00" | రవి | చంద్ర | రవి |
| 121. | $23^0$-20'-00" | to | $24^0$-06'-40" | రవి | కుజ | కుజ |
| 122. | $24^0$-06'-40" | to | $26^0$-06'-40" | రవి | కుజ | రాహు |
| 123. | $26^0$-06'-40" | to | $27^0$-53'-20" | రవి | కుజ | గురు |
| 124. | $27^0$-53'-20" | to | $30^0$-00'-00" | రవి | కుజ | శని |

| తుల | | | | రాశ్యాధిపతి | నక్షత్రాధిపతి | ఉప అధిపతి |
|---|---|---|---|---|---|---|
| 125. | $00^0$-00'-00" | to | $01^0$-53'-20" | శుక్ర | కుజ | బుధ |
| 126. | $01^0$-53'-20" | to | $02^0$-40'-00" | శుక్ర | కుజ | కేతు |
| 127. | $02^0$-40'-00" | to | $04^0$-53'-20" | శుక్ర | కుజ | శుక్ర |
| 128. | $04^0$-53'-20 | to | $05^0$-33'-20" | శుక్ర | కుజ | రవి |
| 129. | $05^0$-33'-20" | to | $06^0$-40'-00" | శుక్ర | కుజ | చంద్ర |
| 130. | $06^0$-40'-00" | to | $08^0$-40'-00" | శుక్ర | రాహు | రాహు |
| 131. | $08^0$-40'-00" | to | $10^0$-26'-40" | శుక్ర | రాహు | గురు |
| 132. | $10^0$-26'-40" | to | $12^0$-33'-20" | శుక్ర | రాహు | శని |
| 133. | $12^0$-33'-20" | to | $14^0$-26'-40" | శుక్ర | రాహు | బుధ |
| 134. | $14^0$-26'-40" | to | $15^0$-13'-20" | శుక్ర | రాహు | కేతు |
| 135. | $15^0$-13'-20" | to | $17^0$-26'-40" | శుక్ర | రాహు | శుక్ర |
| 136. | $17^0$-26'-40" | to | $18^0$-06'-40" | శుక్ర | రాహు | రవి |
| 137. | $18^0$-06'-40" | to | $19^0$-13'-20" | శుక్ర | రాహు | చంద్ర |
| 138. | $19^0$-13'-20" | to | $20^0$-00'-00" | శుక్ర | రాహు | కుజ |
| 139. | $20^0$-00'-00" | to | $21^0$-46'-40" | శుక్ర | గురు | గురు |
| 140. | $21^0$-46'-40" | to | $23^0$-53'-20" | శుక్ర | గురు | శని |
| 141. | $23^0$-53'-20" | to | $25^0$-46'-20" | శుక్ర | గురు | బుధ |
| 142. | $25^0$-46'-20" | to | $26^0$-33'-20" | శుక్ర | గురు | కేతు |
| 143. | $26^0$-33'-20" | to | $28^0$-46'-40" | శుక్ర | గురు | శుక్ర |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 144. | 28°-46'-40" | to | 29°-26'-40" | శుక్ర | గురు | రవి |
| 145. | 29°-26'-40" | to | 30°-00'-00" | శుక్ర | గురు | చంద్ర |

| వృశ్చికం | | | | రాశ్యాధిపతి | నక్షత్రాధిపతి | ఉప అధిపతి |
|---|---|---|---|---|---|---|
| 146. | 00°-00'-00" | to | 00°-33'-20" | కుజ | గురు | చంద్ర |
| 147. | 00°-33'-20" | to | 01°-20'-00" | కుజ | గురు | కుజ |
| 148. | 01°-20'-00" | to | 03°-20'-00" | కుజ | గురు | రాహు |
| 149. | 03°-20'-00" | to | 05°-26'-40" | కుజ | శని | శని |
| 150. | 05°-26'-40" | to | 07°-20'-00" | కుజ | శని | బుధ |
| 151. | 07°-20'-00" | to | 08°-06'-40" | కుజ | శని | కేతు |
| 152. | 08°-06'-40" | to | 10°-20'-00" | కుజ | శని | శుక్ర |
| 153. | 10°-20'-00" | to | 11°-00'-00" | కుజ | శని | రవి |
| 154. | 11°-00'-00" | to | 12°-06'-40" | కుజ | శని | చంద్ర |
| 155. | 12°-06'-40" | to | 12°-53'-20" | కుజ | శని | కుజ |
| 156. | 12°-53'-20" | to | 14°-53'-20" | కుజ | శని | రాహు |
| 157. | 14°-53'-20" | to | 16°-40'-20" | కుజ | శని | గురు |
| 158. | 16°-40'-20" | to | 18°-33'-20" | కుజ | బుధ | బుధ |
| 159. | 18°-33'-20" | to | 19°-20'-00" | కుజ | బుధ | కేతు |
| 160. | 19°-20'-00" | to | 21°-33'-20" | కుజ | బుధ | శుక్ర |
| 161. | 21°-33'-20" | to | 22°-13'-20" | కుజ | బుధ | రవి |
| 162. | 22°-13'-20" | to | 23°-20'-00" | కుజ | బుధ | చంద్ర |
| 163. | 23°-20'-00" | to | 24°-06'-40" | కుజ | బుధ | కుజ |
| 164. | 24°-06'-40" | to | 26°-06'-40" | కుజ | బుధ | రాహు |
| 165. | 26°-6'-40" | to | 27°-53'-20" | కుజ | బుధ | గురు |
| 166. | 27°-53'-20" | to | 30°-00'-00" | కుజ | బుధ | శని |

| ధనుస్సు | | | | రాశ్యాధిపతి | నక్షత్రాధిపతి | ఉప అధిపతి |
|---|---|---|---|---|---|---|
| 167. | 00°-00'-00" | to | 00°-46'-40" | గురు | కేతు | కేతు |
| 168. | 00°-46'-40" | to | 03°-00'-00" | గురు | కేతు | శుక్ర |
| 169. | 03°-00'-00" | to | 03°-40'-00" | గురు | కేతు | రవి |
| 170. | 03°-40'-00" | to | 04°-46'-40" | గురు | కేతు | చంద్ర |
| 171. | 04°-46'-40" | to | 05°-33'-20" | గురు | కేతు | కుజ |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 230. | $00^0$-33'-20" | to | $01^0$-20'-00" | గురు | గురు | కుజ |
| 231. | $01^0$-20'-00" | to | $03^0$-20'-00" | గురు | గురు | రాహు |
| 232. | $03^0$-20'-00" | to | $05^0$-26'-40" | గురు | శని | శని |
| 233. | $05^0$-26'-40" | to | $07^0$-20'-00" | గురు | శని | బుధ |
| 234. | $07^0$-20'-00" | to | $08^0$-6'-40" | గురు | శని | కేతు |
| 235. | $8^0$-06'-40" | to | $10^0$-20'-00" | గురు | శని | శుక్ర |
| 236. | $10^0$-20'-00" | to | $11^0$-00'-00" | గురు | శని | రవి |
| 237. | $11^0$-00'-00" | to | $12^0$-06'-40" | గురు | శని | చంద్ర |
| 238. | $12^0$-06'-40" | to | $12^0$-53'-20" | గురు | శని | కుజ |
| 239. | $12^0$-53'-20" | to | $14^0$-53'-20" | గురు | శని | రాహు |
| 240. | $14^0$-53'-20" | to | $16^0$-40'-00" | గురు | శని | గురు |
| 241. | $16^0$-40'-00" | to | $18^0$-33'-20" | గురు | బుధ | బుధ |
| 242. | $18^0$-33'-20" | to | $19^0$-20'-00" | గురు | బుధ | కేతు |
| 243. | $19^0$-20'-00" | to | $21^0$-33'-20" | గురు | బుధ | శుక్ర |
| 244. | $21^0$-33'-20" | to | $22^0$-13'-20" | గురు | బుధ | రవి |
| 245. | $22^0$-13'-20" | to | $23^0$-20'-00" | గురు | బుధ | చంద్ర |
| 246. | $23^0$-20'-00" | to | $24^0$-06'-40" | గురు | బుధ | కుజ |
| 247. | $24^0$-06'-40" | to | $26^0$-06'-40" | గురు | బుధ | రాహు |
| 248. | $26^0$-06'-40" | to | $27^0$-53'-20" | గురు | బుధ | గురు |
| 249. | $27^0$-53'-20" | to | $30^0$-00'-00" | గురు | బుధ | శని |

## వింశోత్తరీ - దశా సాధన

| గ్రహం | దశాసంవత్సరం | జనన నక్షత్రములు |
|---|---|---|
| రవి | 6 | కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ |
| చంద్ర | 10 | రోహిణి, హస్త, శ్రవణం |
| కుజ | 7 | మృగశిర,చిత్త, ధనిష్ఠ |
| రాహు | 18 | ఆర్ద్ర, స్వాతి, శతభిషం |
| గురు | 16 | పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర |
| శని | 19 | పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర |
| బుధ | 17 | ఆశ్రేష, జ్యేష్ఠ, రేవతి |
| కేతు | 7 | మఘ,మూల, అశ్వని |
| శుక్ర | 20 | పుబ్బ, పూర్వాషాఢ, భరణి |

**అంతర్దశలు**

ఏ గ్రహ దశలో ఎవరి అంతర్దశ కావలెనో వారిరువురి దశావత్సరములు గుణించగా చివరి అంకెను మూడుచే గుణించిన రోజులు వచ్చును. మొదటి అంకెలు మాసములు అగును. ఉదాహరణకు రవి దశ శని అంతరం కావలెను అనిన ఎడల రవి 6 × శని 19 = 114.

114 అందు 4×3 = 12 అనగా 11 నెలల 12 రోజులు. రవి × శని అంతర్దశా కాలము.

## విదశా గణితం

మనకు ఏ అంతర్దశలో విదశలు కావలెనో ఆ అంతర్దశా కాలమును రోజులలోకి మార్చి దానిని ఏ గ్రహము యొక్క విదశ కావలెనో ఆ గ్రహము యొక్క దశా వత్సరములతో గుణించి 120చే భాగించగా విదశలు వచ్చును.

ఉదాహరణకు రవిలో రవి 3నె 18రోజులు = (3×30)+18 = 108రోజులు.

(108×6)÷120 = 648 ÷120 = 5 రోజుల 24ఘడియలు.

యిదేవిధంగా మిగిలినవి కూడా గణించవలయును.

## సూక్ష్మ దశాగణితం

ఏ విదశలో మనకు సూక్ష్మదశలు కావలెనో ఆ విదశా ప్రమాణమును ఘడియలలోనికి మార్చి దానికి ఏ గ్రహ సూక్ష్మదశ కావలెనో ఆ గ్రహ దశా వత్సరములతో గుణించి మొత్తమును 120 చే భాగించగా సూక్ష్మదశలు వచ్చును.

ఉదాహరణ రవి × రవి × రవి విదశకు సూక్ష్మదశ కావలెను.

రవిదశ - 6సం॥లు.

రవి×రవి అంతర్దశలు = 6×6 = 36 = 3నె॥ 18రోజులు

విదశ = రవి × రవి × రవి = 5 రోజులు 24 ఘడియలు.

రవి × రవి × రవి = 5రోజుల 24ఘడియలు = 324ఘడియలు (రోజుకు 60 ఘడియలు)

(324×6) ÷120 = 1944 ÷ 120 = 16.12

రవి × రవి × రవి × రవి = 16ఘ 12విఘలు

ఈ విధముగనే ప్రాణదశా గణితము కూడా.

ఉదాహరణకు రవి × రవి × రవిలోని సూక్ష్మదశా వివరం

| | రవి | చంద్ర | కుజ | రాహు | గురు | శని | కేతు | శుక్ర |
|---|---|---|---|---|---|---|---|---|
| ఘ | 16 | 27 | 18 | 48 | 43 | 51 | 18 | 54 |
| విఘ | 12 | 00 | 54 | 36 | 12 | 18 | 54 | 00 |

ఈ విధంగా మిగిలిన సూక్ష్మదశలను సాధించవలెను.

# కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ - సూర్యదశ - 6సంలు

## అంతర్దశలు - విదశలు

| సూర్యుడు | | చంద్రుడు | | కుజుడు | |
|---|---|---|---|---|---|
| | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ |
| సూ | 00-05-24 | చం | 00-15-00 | కు | 00-07-21 |
| చం | 00-09-00 | కు | 00-10-30 | రా | 00-18-54 |
| కు | 00-16-18 | రా | 00-27-00 | గు | 00-16-48 |
| రా | 00-16-12 | గు | 00-24-00 | శ | 00-19-57 |
| గు | 00-14-24 | శ | 00-28-30 | బు | 00-17-51 |
| శ | 00-17-06 | బు | 00-25-30 | కే | 00-07-21 |
| బు | 00-15-18 | కే | 00-10-30 | శు | 00-21-00 |
| కే | 00-06-18 | శు | 01-00-00 | సూ | 00-06-18 |
| శు | 00-18-00 | సూ | 00-09-00 | చం | 00-10-30 |
| **రxర** | **03-18-00** | **రxచం** | **06-00-00** | **రxకు** | **04-06-00** |

| రాహు | | గురు | | శని | |
|---|---|---|---|---|---|
| | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ |
| రా | 01-18-36 | గురు | 01-08-24 | శని | 01-24-09 |
| గు | 01-13-12 | శ | 01-15-36 | బు | 01-18-27 |
| శ | 01-21-18 | బు | 01-10-48 | కే | 00-19-57 |
| బు | 01-15-54 | కే | 00-16-48 | శు | 01-27-00 |
| కే | 00-18-54 | శు | 01-18-00 | సూ | 00-17-06 |
| శు | 01-24-00 | సూ | 00-14-24 | చం | 00-28-30 |
| సూ | 00-16-12 | చం | 00-24-00 | కు | 00-19-57 |
| చం | 00-27-00 | కు | 00-16-48 | రా | 01-21-18 |
| కు | 00-18-54 | రా | 01-13-12 | గు | 01-15-36 |
| **రxరా** | **10-24-00** | **రxగు** | **09-18-00** | **రxశ** | **11-12-00** |

| బుధుడు | | కేతు | | శుక్రుడు | |
|---|---|---|---|---|---|
| | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ |
| బుధ | 01-13-21 | కేతు | 00-07-21 | శుక్ర | 02-00-00 |
| కే | 00-17-51 | శు | 00-21-00 | సూ | 00-18-00 |
| శు | 01-21-00 | సూ | 00-06-18 | చం | 01-00-00 |
| సూ | 00-15-18 | చం | 00-10-30 | కు | 00-21-00 |
| చం | 00-25-30 | కు | 00-07-21 | రా | 01-24-00 |
| కు | 00-17-51 | రా | 00-18-54 | గు | 01-18-00 |
| రా | 01-15-54 | గు | 00-16-48 | శ | 01-27-00 |
| గు | 01-10-48 | శ | 00-19-57 | బు | 01-21-00 |
| శ | 01-18-27 | బు | 00-17-51 | కే | 00-21-00 |
| **రxబు** | **10-24-00** | **రxకే** | **04-06-00** | **రxశు** | **12-00-00** |

# రోహిణి, హస్త, శ్రవణం - చంద్రదశ 10సం॥లు

## అంతర్దశలు - విదశలు

| చంద్రుడు | నెల-దిన-ఘ |
|---|---|
| చం | 00-25-00 |
| కు | 00-17-30 |
| రా | 01-15-00 |
| గు | 01-10-00 |
| శ | 01-17-30 |
| బు | 01-12-30 |
| కే | 00-17-30 |
| శు | 01-20-00 |
| సూ | 00-15-00 |
| **చం×చం** | **10-00-00** |

| కుజుడు | నెల-దిన-ఘ |
|---|---|
| కు | 00-12-15 |
| రా | 01-01-30 |
| గు | 00-28-00 |
| శ | 01-03-15 |
| బు | 00-29-45 |
| కే | 00-12-15 |
| శు | 01-05-00 |
| సూ | 00-10-30 |
| చం | 00-17-30 |
| **చం×కు** | **07-00-00** |

| రాహువు | నెల-దిన-ఘ |
|---|---|
| రా | 02-21-00 |
| గు | 02-12-00 |
| శ | 02-25-30 |
| బు | 02-16-30 |
| కే | 01-01-30 |
| శు | 03-00-00 |
| సూ | 00-27-00 |
| చం | 01-15-00 |
| కు | 01-01-30 |
| **చం×రా** | **18-00-00** |

| గురు | నెల-దిన-ఘ |
|---|---|
| గు | 02-04-00 |
| శ | 02-16-00 |
| బు | 02-08-00 |
| కే | 00-28-00 |
| శు | 02-20-00 |
| సూ | 00-24-00 |
| చం | 01-10-00 |
| కు | 00-28-00 |
| రా | 02-12-00 |
| **చం×గు** | **16-00-00** |

| శని | నెల-దిన-ఘ |
|---|---|
| శని | 03-00-15 |
| బు | 02-20-45 |
| కే | 01-03-15 |
| శు | 03-05-00 |
| సూ | 00-28-30 |
| చం | 01-17-30 |
| కు | 01-03-15 |
| రా | 02-25-30 |
| గు | 02-16-00 |
| **చం×శ** | **19-00-00** |

| బుధుడు | నెల-దిన-ఘ |
|---|---|
| బుధ | 02-12-15 |
| కే | 00-29-45 |
| శు | 02-25-00 |
| సూ | 00-25-30 |
| చం | 01-12-30 |
| కు | 00-29-45 |
| రా | 02-16-30 |
| గు | 02-08-00 |
| శ | 02-20-45 |
| **చం×బు** | **17-00-00** |

| కేతు | నెల-దిన-ఘ |
|---|---|
| కేతు | 00-12-15 |
| శు | 01-05-00 |
| సూ | 00-10-30 |
| చం | 00-17-30 |
| కు | 00-12-15 |
| రా | 01-01-30 |
| గు | 00-28-00 |
| శ | 01-03-15 |
| బు | 00-29-45 |
| **చం×కే** | **07-00-00** |

| శుక్రుడు | నెల-దిన-ఘ |
|---|---|
| శుక్ర | 03-10-00 |
| సూ | 01-00-00 |
| చం | 01-20-00 |
| కు | 01-05-00 |
| రా | 03-00-00 |
| గు | 02-20-00 |
| శ | 03-05-00 |
| బు | 02-29-45 |
| కే | 01-05-00 |
| **చం×శు** | **20-00-00** |

| సూర్యుడు | నెల-దిన-ఘ |
|---|---|
| సూ | 00-09-00 |
| చం | 00-15-00 |
| కు | 00-10-30 |
| రా | 00-27-00 |
| గు | 00-24-00 |
| శ | 00-28-30 |
| బు | 00-25-30 |
| కే | 00-10-30 |
| శు | 01-00-00 |
| **చం×ర** | **06-00-00** |

# మృగశిర,చిత్త, ధనిష్ఠ- కుజదశ 7 సం॥లు

## అంతర్దశలు - విదశలు

**కుజుడు**

| | నెల-దిన-ఘ |
|---|---|
| కు | 00-08-34 1/2 |
| రా | 00-22-03 |
| గు | 00-19-36 |
| శ | 00-23-16 1/2 |
| బు | 00-20-49 1/2 |
| కే | 00-08-34 1/2 |
| శు | 00-24-30 |
| సూ | 00-07-21 |
| చం | 00-12-15 |
| **కు×కు** | **04-27-00** |

**రాహువు**

| | నెల-దిన-ఘ |
|---|---|
| రా | 01-26-42 |
| గు | 01-20-24 |
| శ | 01-29-51 |
| బు | 01-23-33 |
| కే | 00-22-03 |
| శు | 02-03-00 |
| సూ | 00-18-54 |
| చం | 01-01-30 |
| కు | 00-22-03 |
| **కు×రా** | **12-08-00** |

**గురు**

| | నెల-దిన-ఘ |
|---|---|
| గు | 01-14-48 |
| శ | 01-23-12 |
| బు | 01-17-36 |
| కే | 00-19-36 |
| శు | 01-26-00 |
| సూ | 00-16-48 |
| చం | 00-28-00 |
| కు | 00-19-36 |
| రా | 01-20-24 |
| **కు×గు** | **11-06-00** |

**శని**

| | నెల-దిన-ఘ |
|---|---|
| శని | 02-03-10 1/2 |
| బు | 01-26-31 1/2 |
| కే | 00-26-16 1/2 |
| శు | 02-06-30 |
| సూ | 00-19-57 |
| చం | 01-03-15 |
| కు | 00-23-16 1/2 |
| రా | 01-29-51 |
| గు | 01-23-12 |
| **కు×శ** | **13-09-00** |

**బుధుడు**

| | నెల-దిన-ఘ |
|---|---|
| బు | 01-20-34 1/2 |
| కే | 00-20-49 1/2 |
| శు | 01-29-30 |
| సూ | 00-17-51 |
| చం | 00-29-45 |
| కు | 00-29-49 1/2 |
| రా | 01-23-33 |
| గు | 01-17-36 |
| శ | 01-26-31 1/2 |
| **కు×బు** | **11-27-00** |

**కేతు**

| | నెల-దిన-ఘ |
|---|---|
| కేతు | 00-08-34 1/2 |
| శు | 00-24-30 |
| సూ | 00-07-21 |
| చం | 00-12-15 |
| కు | 00-08-34 1/2 |
| రా | 00-22-00 |
| గు | 00-19-36 |
| శ | 00-23-16 1/2 |
| బు | 00-20-49 1/2 |
| **కు×కే** | **04-27-00** |

**శుక్రుడు**

| | నెల-దిన-ఘ |
|---|---|
| శుక్ర | 02-10-00 |
| సూ | 00-21-00 |
| చం | 01-05-00 |
| కు | 00-24-30 |
| రా | 02-03-00 |
| గు | 01-26-00 |
| శ | 02-06-30 |
| బు | 01-29-30 |
| కే | 01-24-30 |
| **కు×శు** | **14-00-00** |

**సూర్యుడు**

| | నెల-దిన-ఘ |
|---|---|
| సూ | 00-06-18 |
| చం | 00-10-30 |
| కు | 00-07-21 |
| రా | 00-18-54 |
| గు | 00-16-48 |
| శ | 00-19-57 |
| బు | 00-17-51 |
| కే | 00-07-21 |
| శు | 00-21-00 |
| **కు×సూ** | **04-06-00** |

**చంద్రుడు**

| | నెల-దిన-ఘ |
|---|---|
| చం | 00-17-30 |
| కు | 00-12-15 |
| రా | 01-01-30 |
| గు | 00-28-00 |
| శ | 01-03-15 |
| బు | 00-29-45 |
| కే | 00-12-15 |
| శు | 01-05-00 |
| సూ | 00-10-30 |
| **కు×చం** | **07-00-00** |

# ఆర్ద్ర, స్వాతి, శతభిషం- రాహుదశ 18 సం॥లు

## అంతర్దశలు - విదశలు

| రాహువు | | గురు | | శని | |
|---|---|---|---|---|---|
| | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ |
| రా | 04-25-48 | గు | 03-25-12 | శ | 05-12-27 |
| గు | 04-09-36 | శ | 04-16-48 | బు | 04-25-21 |
| శ | 05-03-54 | బు | 04-02-24 | కే | 01-29-51 |
| బు | 04-17-42 | కే | 01-20-00 | శు | 05-21-00 |
| కే | 01-26-42 | శు | 04-24-00 | సూ | 01-21-18 |
| శు | 05-12-00 | సూ | 01-13-12 | చం | 02-25-30 |
| సూ | 01-18-36 | చం | 02-12-00 | కు | 01-29-51 |
| చం | 02-21-00 | కు | 01-20-24 | రా | 05-03-54 |
| కు | 01-26-42 | రా | 04-09-36 | గు | 04-16-48 |
| **రా×రా** | **32-12-00** | **రా×గు** | **28-24-00** | **రా×శ** | **34-06-00** |

| బుధుడు | | కేతు | | శుక్రుడు | |
|---|---|---|---|---|---|
| | | | నెల-దిన-ఘ | నెల-దిన-ఘ | నెల-దిన-ఘ |
| బు | 04-10-03 | కే | 00-22-03 | శు | 06-00-00 |
| కే | 01-23-33 | శు | 02-03-00 | సూ | 01-24-00 |
| శు | 05-03-00 | సూ | 00-18-54 | చం | 03-00-00 |
| సూ | 01-15-54 | చం | 01-01-30 | కు | 02-03-00 |
| చం | 02-16-30 | కు | 00-22-03 | రా | 05-12-00 |
| కు | 01-23-33 | రా | 01-26-42 | గు | 04-24-00 |
| రా | 04-17-42 | గు | 01-20-24 | శ | 05-21-00 |
| గు | 04-02-24 | శ | 01-29-51 | బు | 05-03-00 |
| శ | 04-25-21 | బు | 01-23-33 | కే | 02-03-00 |
| **రా×బు** | **30-18-00** | **రా×కే** | **12-18-00** | **రా×శు** | **36-00-00** |

| సూర్యుడు | | చంద్రుడు | | కుజుడు | |
|---|---|---|---|---|---|
| | | నెల-దిన-ఘ | నెల-దిన-ఘ | నెల-దిన-ఘ | |
| సూ | 00-16-12 | చం | 01-15-00 | కు | 00-22-03 |
| చం | 00-27-00 | కు | 01-01-30 | రా | 01-26-42 |
| కు | 00-18-54 | రా | 02-21-00 | గు | 01-20-24 |
| రా | 01-18-36 | గు | 02-12-00 | శ | 01-29-51 |
| గు | 01-13-12 | శ | 02-25-30 | బు | 01-23-33 |
| శ | 01-21-18 | బు | 02-06-30 | కే | 00-22-03 |
| బు | 01-15-54 | కే | 01-01-30 | శు | 02-03-00 |
| కే | 00-18-51 | శు | 03-00-00 | సూ | 00-18-54 |
| శు | 01-24-00 | సూ | 00-27-00 | చం | 01-01-30 |
| **రా×సూ** | **10-24-00** | **రా×చం** | **18-00-00** | **రా×కు** | **12-18-00** |

## పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర- గురుదశ 16 సం॥లు

### అంతర్దశలు - విదశలు

| గురు | | శని | | బుధుడు | |
|---|---|---|---|---|---|
| | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ |
| గు | 03-12-24 | శ | 04-24-24 | బు | 03-25-36 |
| శ | 04-01-36 | బు | 04-09-12 | కే | 01-17-36 |
| బు | 03-18-48 | కే | 01-23-12 | శు | 04-16-00 |
| కే | 01-14-48 | శు | 05-02-00 | సూ | 01-10-48 |
| శు | 04-08-00 | సూ | 01-15-36 | చం | 02-08-00 |
| సూ | 01-08-24 | చం | 02-16-00 | కు | 01-17-36 |
| చం | 02-04-00 | కు | 01-23-12 | రా | 04-02-24 |
| కు | 01-14-48 | రా | 04-16-48 | గు | 03-18-48 |
| రా | 03-25-12 | గు | 04-01-36 | శ | 04-09-12 |
| **గు×గు** | **25-18-00** | **గు×శ** | **30-12-00** | **గు×బు** | **27-06-00** |

| కేతు | | శుక్రుడు | | సూర్యుడు | |
|---|---|---|---|---|---|
| | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ |
| కే | 00-19-36 | శు | 05-10-00 | సూ | 00-14-24 |
| శు | 01-26-00 | సూ | 01-18-00 | చం | 00-24-00 |
| సూ | 00-16-48 | చం | 02-20-00 | కు | 00-16-48 |
| చం | 00-28-00 | కు | 01-26-00 | రా | 01-13-12 |
| కు | 00-19-36 | రా | 04-24-00 | గు | 01-08-24 |
| రా | 01-20-24 | గు | 04-08-00 | శ | 01-15-36 |
| గు | 01-14-48 | శ | 05-02-00 | బు | 01-10-48 |
| శ | 01-23-12 | బు | 04-16-00 | కే | 00-16-48 |
| బు | 01-17-36 | కే | 01-26-00 | శు | 01-18-00 |
| **గు×కే** | **11-06-00** | **గు×శు** | **32-00-00** | **గు×సూ** | **09-18-00** |

| చంద్రుడు | | కుజుడు | | రాహువు | |
|---|---|---|---|---|---|
| | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ |
| చం | 01-10-00 | కు | 00-19-36 | రా | 04-09-36 |
| కు | 00-28-00 | రా | 01-20-24 | గు | 03-25-12 |
| రా | 02-12-00 | గు | 01-14-48 | శ | 04-16-48 |
| గు | 02-04-00 | శ | 01-23-12 | బు | 04-02-24 |
| శ | 02-16-00 | బు | 01-17-36 | కే | 01-20-24 |
| బు | 02-08-00 | కే | 00-19-36 | శు | 04-24-00 |
| కే | 00-28-00 | శు | 01-26-00 | సూ | 01-13-12 |
| శు | 02-20-00 | సూ | 00-16-48 | చం | 02-12-00 |
| సూ | 00-24-00 | చం | 00-28-00 | కు | 01-20-24 |
| **గు×చం** | **16-00-00** | **గు×కు** | **11-06-00** | **గు×రా** | **28-24-00** |

# పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర - శనిదశ 19 సం॥లు

## అంతర్దశలు - విదశలు

| శని | | బుధుడు | | కేతు | |
|---|---|---|---|---|---|
| | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ |
| శ | 05-21-28½ | బు | 04-17-16½ | కే | 00-23-16½ |
| బు | 05-03-25½ | కే | 01-26-31½ | శు | 02-06-30 |
| కే | 02-03-10½ | శు | 05-11-30 | సూ | 00-10-57 |
| శు | 06-00-30 | సూ | 01-18-27 | చం | 01-03-15 |
| సూ | 01-24-09 | చం | 02-20-45 | కు | 00-23-16 |
| చం | 03-00-15 | కు | 01-26-31½ | రా | 01-29-51 |
| కు | 02-03-10½ | రా | 04-25-21 | గు | 01-23-12 |
| రా | 05-12-27 | గు | 04-09-12 | శ | 02-03-10½ |
| గు | 04-24-24 | శ | 05-03-25½ | బు | 01-26-31½ |
| **శ×శ** | **36-03-00** | **శ×బు** | **32-09-00** | **శ×కే** | **13-09-00** |

| శుక్రుడు | | సూర్యుడు | | చంద్రుడు | |
|---|---|---|---|---|---|
| | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ |
| శు | 06-10-00 | సూ | 00-17-06 | చం | 01-17-30 |
| సూ | 01-27-00 | చం | 00-28-30 | కు | 01-03-15 |
| చం | 03-05-00 | కు | 00-19-57 | రా | 02-25-30 |
| కు | 02-06-30 | రా | 01-21-18 | గు | 02-16-00 |
| రా | 05-21-00 | గు | 01-15-36 | శ | 03-00-15 |
| గు | 05-02-00 | శ | 01-24-09 | బు | 02-20-45 |
| శ | 06-00-30 | బు | 01-18-27 | కే | 01-03-15 |
| బు | 05-11-30 | కే | 00-19-57 | శు | 03-05-00 |
| కే | 02-06-30 | శు | 01-27-00 | సూ | 00-28-30 |
| **శ×శు** | **38-00-00** | **శ×సూ** | **11-12-00** | **శ×చం** | **19-00-00** |

| కుజుడు | | రాహువు | | గురు | |
|---|---|---|---|---|---|
| | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ |
| కు | 00-23-16½ | రా | 05-03-54 | గు | 04-01-36 |
| రా | 01-29-51 | గు | 04-16-48 | శ | 04-24-24 |
| గు | 01-23-12 | శ | 05-12-27 | బు | 04-09-12 |
| శ | 02-03-10½ | బు | 04-25-21 | కే | 01-23-12 |
| బు | 01-26-31½ | కే | 01-29-51 | శు | 05-02-00 |
| కే | 00-23-16½ | శు | 05-21-00 | సూ | 01-15-36 |
| శు | 02-06-30 | సూ | 01-21-18 | చం | 02-16-00 |
| సూ | 00-19-57 | చం | 02-25-30 | కు | 01-23-12 |
| చం | 01-03-15 | కు | 01-29-51 | రా | 04-16-48 |
| **శ×కు** | **13-09-00** | **శ×రా** | **34-06-00** | **శ×గు** | **30-12-00** |

## ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి - బుధదశ 17 సం॥లు

## అంతర్దశలు - విదశలు

| బుధుడు | | కేతు | | శుక్రుడు | |
|---|---|---|---|---|---|
| | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ |
| బు | 04-02-49 1/2 | కే | 00-20-49 1/2 | శు | 05-20-00 |
| కే | 01-20-34 1/2 | శు | 01-29-30 | సూ | 01-21-00 |
| శు | 04-24-30 | సూ | 00-17-51 | చం | 02-25-00 |
| సూ | 01-13-21 | చం | 00-29-48 | కు | 01-29-30 |
| చం | 02-12-15 | కు | 00-20-49 1/2 | రా | 05-03-00 |
| కు | 01-20-34 1/2 | రా | 01-23-33 | గు | 04-16-00 |
| రా | 04-10-03 | గు | 01-17-36 | శ | 05-11-30 |
| గు | 03-25-36 | శ | 01-26-31 1/2 | బు | 04-24-30 |
| శ | 04-17-16 1/2 | బు | 01-20-34 1/2 | కే | 01-29-30 |
| **బు×బు** | **28-27-00** | **బు×కే** | **11-27-00** | **బు×శు** | **34-00-00** |

| సూర్యుడు | | చంద్రుడు | | కుజుడు | |
|---|---|---|---|---|---|
| | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ |
| సూ | 00-15-18 | చం | 01-12-30 | కు | 00-20-49 1/2 |
| చం | 01-25-30 | కు | 00-29-45 | రా | 01-23-33 |
| కు | 01-17-51 | రా | 02-16-30 | గు | 01-17-36 |
| రా | 01-15-54 | గు | 02-08-00 | శ | 01-26-31 1/2 |
| గు | 01-10-48 | శ | 02-20-45 | బు | 01-20-34 1/2 |
| శ | 01-18-27 | బు | 02-12-15 | కే | 00-20-49 1/2 |
| బు | 01-13-21 | కే | 00-29-45 | శు | 01-29-30 |
| కే | 00-17-51 | శు | 02-25-00 | సూ | 00-17-51 |
| శు | 01-21-00 | సూ | 00-25-30 | చం | 00-29-45 |
| **బు×సూ** | **10-06-00** | **బు×చం** | **17-00-00** | **బు×కు** | **11-27-00** |

| రాహువు | | గురు | | శని | |
|---|---|---|---|---|---|
| | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ |
| రా | 04-17-42 | గు | 03-18-48 | శ | 05-03-25 1/2 |
| గు | 04-02-24 | శ | 04-09-12 | బు | 04-17-16 1/2 |
| శ | 04-25-21 | బు | 03-25-36 | కే | 01-26-31 1/2 |
| బు | 04-10-03 | కే | 01-17-36 | శు | 05-11-30 |
| కే | 01-23-33 | శు | 04-16-00 | సూ | 01-18-27 |
| శు | 05-03-00 | సూ | 01-10-48 | చం | 02-20-45 |
| సూ | 01-15-54 | చం | 02-08-00 | కు | 01-26-31 1/2 |
| చం | 02-16-30 | కు | 01-17-36 | రా | 04-25-21 |
| కు | 01-23-33 | రా | 04-02-24 | గు | 04-09-12 |
| **బు×రా** | **30-18-00** | **బు×గు** | **27-06-00** | **బు×శ** | **32-09-00** |

# అశ్విని, మఘ, మూల - కేతుదశ 7 సం॥లు

## అంతర్దశలు - విదశలు

| కేతు | | శుక్రుడు | | సూర్యుడు | |
|---|---|---|---|---|---|
| | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ |
| కే | 00-08-34 1/2 | శు | 02-10-00 | సూ | 05-06-18 |
| శు | 00-24-30 | సూ | 00-21-00 | చం | 00-10-30 |
| సూ | 00-07-21 | చం | 01-05-00 | కు | 00-07-21 |
| చం | 00-12-15 | కు | 00-24-30 | రా | 00-18-54 |
| కు | 00-08-34 1/2 | రా | 02-03-00 | గు | 00-16-48 |
| రా | 00-22-03 | గు | 01-26-00 | శ | 00-19-57 |
| గు | 00-19-36 | శ | 02-06-30 | బు | 00-17-51 |
| శ | 00-23-16 1/2 | బు | 01-29-30 | కే | 00-07-21 |
| బు | 00-20-49 1/2 | కే | 00-24-30 | శు | 00-21-00 |
| **కే×కే** | **04-27-00** | **కే×శు** | **14-00-00** | **కే×సూ** | **04-06-00** |

| చంద్రుడు | | కుజుడు | | రాహువు | |
|---|---|---|---|---|---|
| | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ |
| చం | 00-17-30 | కు | 00-08-34 1/2 | రా | 01-26-42 |
| కు | 00-12-15 | రా | 00-22-03 | గు | 01-20-24 |
| రా | 01-01-30 | గు | 00-19-36 | శ | 01-29-51 |
| గు | 00-28-00 | శ | 00-23-16 1/2 | బు | 01-23-33 |
| శ | 01-02-15 | బు | 00-20-48 1/2 | కే | 00-22-03 |
| బు | 00-29-45 | కే | 00-08-34 1/2 | శు | 02-03-00 |
| కే | 00-12-15 | శు | 00-24-30 | సూ | 00-18-54 |
| శు | 01-05-00 | సూ | 00-07-21 | చం | 01-01-30 |
| సూ | 00-10-30 | చం | 00-12-15 | కు | 00-22-03 |
| **కే×చం** | **07-00-00** | **కే×కు** | **04-27-00** | **కే×రా** | **12-18-00** |

| గురు | | శని | | బుధుడు | |
|---|---|---|---|---|---|
| | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ | | నెల-దిన-ఘ |
| గు | 01-14-48 | శ | 02-03-10 1/2 | బు | 01-20-34 1/2 |
| శ | 01-23-12 | బు | 01-26-31 1/2 | కే | 00-20-49 1/2 |
| బు | 01-17-36 | కే | 00-23-16 1/2 | శు | 01-29-30 |
| కే | 00-19-36 | శు | 02-06-30 | సూ | 00-17-51 |
| శు | 01-26-00 | సూ | 00-19-57 | చం | 00-29-45 |
| సూ | 01-16-48 | చం | 01-03-15 | కు | 00-29-49 1/2 |
| చం | 00-28-00 | కు | 00-23-16 1/2 | రా | 01-23-33 |
| కు | 00-19-36 | రా | 01-29-51 | గు | 01-17-36 |
| రా | 01-20-24 | గు | 01-23-12 | శ | 01-26-31 1/2 |
| **కే×గు** | **11-06-00** | **కే×శ** | **13-09-00** | **కే×బు** | **11-27-00** |

# భరణి, పుబ్బ, పూర్వాషాఢ - శుక్రదశ 20 సం॥లు

## అంతర్దశలు - విదశలు

| శుక్రుడు | నెల-దిన-ఘ | సూర్యుడు | నెల-దిన-ఘ | చంద్రుడు | నెల-దిన-ఘ |
|---|---|---|---|---|---|
| శు | 06-20-00 | సూ | 00-18-00 | చం | 01-20-00 |
| సూ | 02-00-00 | చం | 01-00-00 | కు | 01-05-00 |
| చం | 03-10-00 | కు | 00-21-00 | రా | 03-00-00 |
| కు | 02-10-00 | రా | 01-24-00 | గు | 02-20-00 |
| రా | 06-00-00 | గు | 01-18-00 | శ | 03-05-00 |
| గు | 05-10-00 | శ | 01-27-00 | బు | 02-25-00 |
| శ | 06-10-00 | బు | 01-21-00 | కే | 01-05-00 |
| బు | 05-20-00 | కే | 00-21-00 | శు | 03-10-00 |
| కే | 02-10-00 | శు | 02-00-00 | సూ | 01-00-00 |
| **శు×శు** | **40-00-00** | **శు×సూ** | **12-00-00** | **శు×చం** | **20-00-00** |

| కుజుడు | నెల-దిన-ఘ | రాహువు | నెల-దిన-ఘ | గురు | నెల-దిన-ఘ |
|---|---|---|---|---|---|
| కు | 00-24-30 | రా | 05-12-00 | గు | 04-08-00 |
| రా | 02-03-00 | గు | 04-24-00 | శ | 05-02-00 |
| గు | 01-26-00 | శ | 05-21-00 | బు | 04-16-00 |
| శ | 02-06-30 | బు | 05-03-00 | కే | 01-26-00 |
| బు | 01-29-30 | కే | 02-03-00 | శు | 05-10-00 |
| కే | 01-24-30 | శు | 06-00-00 | సూ | 01-18-00 |
| శు | 02-10-00 | సూ | 01-24-00 | చం | 02-20-00 |
| సూ | 00-21-00 | చం | 03-00-00 | కు | 01-26-00 |
| చం | 01-05-00 | కు | 02-03-00 | రా | 04-24-00 |
| **శు×కు** | **14-00-00** | **శు×రా** | **36-00-00** | **శు×గు** | **32-00-00** |

| శని | నెల-దిన-ఘ | బుధుడు | నెల-దిన-ఘ | కేతు | నెల-దిన-ఘ |
|---|---|---|---|---|---|
| శ | 06-00-30 | బు | 04-24-30 | కే | 00-24-30 |
| బు | 05-11-30 | కే | 01-29-30 | శు | 02-10-00 |
| కే | 02-06-30 | శు | 05-20-00 | సూ | 00-21-00 |
| శు | 06-10-00 | సూ | 01-21-00 | చం | 01-05-00 |
| సూ | 01-27-00 | చం | 02-25-00 | కు | 00-24-30 |
| చం | 03-05-00 | కు | 01-29-30 | రా | 02-03-00 |
| కు | 02-06-30 | రా | 05-03-00 | గు | 01-26-00 |
| రా | 05-21-00 | గు | 04-16-00 | శ | 02-06-30 |
| గు | 05-02-00 | శ | 05-11-30 | బు | 01-29-30 |
| **శు×శ** | **38-00-00** | **శు×బు** | **34-00-00** | **శు×కే** | **14-00-00** |

# అప్రకాశక గ్రహ గణన

## ధూమ, వ్యతీపాత, పరివేష, ఇంద్రచాప, ఉపకేతువుల గణన విధానము

జనన కాలమునకు వున్న రవికి 4 రాశుల 13 భా 20 లిప్తలు కూడినచో "ధూమగ్రహము " వచ్చును. 12-00-00 నుండి ధూమగ్రహం తీసివేయగా "వ్యతీపాత" వచ్చును. వ్యతీపాతకు రా 6-00-00 లిప్తలు కూడినచో "పరివేష" వచ్చును. పరివేషను 12-00-00 లిప్త నుండి తీసివేయగా "యింద్రచాపము" వచ్చును. యింద్రచాపమునకు 16భా 40 లిప్త కూడినచో "ఉపకేతు" వచ్చును.

**ఉదాహరణ** - జననకాల రవి రా. 6-10-భా-11 లిప్తలలో వున్నారు.

(6-10-11) + (4-13-20) = (10-23-31) కుంభంలో ధూమగ్రహము

(12-00-00) -(10-23-31) = 1-6-29 వృషభంలో వ్యతీపాత

(1-6-29) +(6-0-0) = 7-6-29 వృశ్చికంలో పరివేష(పరిధి)

(12-0-0)-(7-6-29) = 4-23-31 సింహంలో ఇంద్రచాప

(4-23-31) +(0-16-40) = 5-10-11 కన్యలో ఉపకేతు

(5-10-11) +(1-0-0) = 6-10-11 స్పష్టరవి

## ప్రాణప్రద సాధనము

సూర్యోదయాది జననకాల ఘడియ విఘడియలను విఘడియలుగా మార్చి 15చేత భాగింపగా రాశులు వచ్చును. శేషమును ముప్పదిచేగుణించి 15చే భాగింపగా భాగలు వచ్చును. శేషమును 60చే గుణించి 15చే భాగింపగా లిప్తలు వచ్చును.

జననకాలముకు చరరాశిలో వున్నచో స్ఫుటరవిలో పైన వచ్చిన రాశ్యాదిని కూడవలెను. సూర్యుడు స్థిరరాశిలో వున్నప్పుడు స్ఫుటసూర్యునికి ఎనిమిది రాశులు కూడి అప్పుడు పైనచేసిన గణితానుగత రాశ్యాది భాగలను కూడవలెను. ద్విస్వభావ రాశిలో రవి వున్నప్పుడు స్ఫుటసూర్యునికి నాలుగు రాశులు కూడి అప్పుడు పైన వచ్చిన రాశ్యాదిని కూడవలెను. అలా చేయగా ప్రాణప్రద స్థితరాశి వచ్చును.

## గుళిక, కాలవేళ, మృత్యు, యమఘంట, అర్ధయామ సాధన

దినప్రమాణమును 8 భాగములు చేయవలెను. ఏవారమునందు జననము అయ్యెనో ఆవారాధిపతులను లెక్క పెట్టగా వరుస ఏడుగ్రహములకు ఏడు ఖండలమీద ఆధిపత్యము వచ్చును. ఎనిమిదివ ఖండకు అధిపతి లేదు. ఎనిమిదివ ఖండ నిరీశ్వర ఖండ. అలాగే రాత్రి జననమైనచో రాత్రి ప్రమాణమును

అనగా సూర్యాస్తమయాది, సూర్యోదయము వరకు వున్న కాలమును 8 భాగములు చేసి 8 ఖండలు చేయగా వారాధిపతి నుండి ఐదవ అధిపతి మొదటి ఖండకు అధిపతి అయి వరుస ఏడు ఖండలకు ఏడుగురు అధిపతులగుదురు. శనిఖండము గుళికఖండము అగును. రవియొక్క ఖండము కాలవేళ అనబడును. కుజునియొక్క ఖండము మృత్యువు అగును. గురువుయొక్క ఖండము యమఘంట అగును. బుధునియొక్క ఖండము అర్ధప్రహార అగును. ఈ విధంగా మొత్తము జననదినమున సూర్యోదయ సూర్యాస్తమయములను గ్రహించి దానిద్వారా ఈ ఉపగ్రహములను గణించవలెను. మాందిగుళికలు ఇరువురు శని కుమారులు అని కాళిదాసు కాలామృతంలో వివరించి మాందియొక్క గణితమును కూడా విడిగా చెప్పిరి. అయితే మాందియొక్క ఫలితములు మాత్రము ఎక్కడా కానరాలేదు. కాలామృతంలో కూడా మాంది ఏ స్థానంలో వుంటే ఆ భావమునకు నష్టము కలుగునని మాత్రమే చెప్పిరి.

## మాంది సాధన

చారుః ఖారి జలా వయో నట తనూ రూపం ద్యుమానాహతం ।
ఖాంగాప్తం రవివాసరాది ఘటికా స్తత్కాలభే మందజః॥
రాత్రే ర్మాన మహః ప్రమాణ మహిహృ త్ఖండ ప్రమాణం భవే
దర్కాద్యా శనివాసరాంత దివసే వారేశ్వరా త్ఖండపాః ॥

దినప్రమాణము 30 ఘడియలు వున్నప్పుడు ఆదివారము నాడు 26 ఘడియలమీదను సోమవారము 22 ఘడియల మీదను మంగళవారము 18 ఘడియల మీదను, బుధవారము 14 ఘడియల మీదను, గురువారం 10 ఘడియల మీదను, శుక్రవారం 6 ఘడియల మీదను, శనివారం 2 ఘడియల మీదను మాంది వుండును. ఆ ఘడియ సమయములకు ఏ లగ్నం వుండునో ఆ లగ్నం మీదే మాంది వ్రాయవలెను. 30 ఘడియలు దినప్రమాణము తక్కువ ఎక్కువగా వున్నప్పుడు దినప్రమాణమును ఘడియలలోకి మార్చి ఆ జనన వార ధృవకముచే గుణించి 30చే భాగించిన ఎడల ఘడియలు, విఘడియలు వచ్చును. ఆ వచ్చిన ఘడియ, విఘడియ సమయములకు ఏ లగ్నమగునో ఆ లగ్నంలోనే మాంది గ్రహములు వేయవలెను.

## ధూమఫలమ్

ఈ అప్రకాశక గ్రహముల యొక్క ఫలితములను భవిష్యత్ భావఫలాధ్యాయములో వివరించుట కష్టం కనుక ఇక్కడ ఆ ఫలితాధ్యాయము ఇచ్చుచున్నాము.

ధూమగ్రహము లగ్నమందు ఉన్నచో ఆ జాతకుడు శూరుడు. స్వచ్ఛమైన నేత్రములు గలవాడు.

స్తబ్ధుడు (వినయము లేనివాడు) నిర్దయుడు,దుర్మార్గుడు, కోపము పైకి ప్రకటించని వాడు అగును.

ద్వితీయమందున్న రోగి, ధనవంతుడు, అంగవైకల్యము గలవాడు, రాజ్యకాంక్ష, పదవీకాంక్ష గలవాడు, మందప్రజ్ఞుడు, నపుంసకుడు అగును.

తృతీయమందున్న బుద్ధిమంతుడు, శౌర్యము గలవాడు, అనుకూలమైన చిత్తవృత్తి గలవాడు, ప్రియముగ మాట్లాడువాడు, ధనము కలవాడు, ధనమును సంపాదించువాడు అగును.

చతుర్ధభావమందున్నచో భార్యసౌఖ్యము లేనివాడు, నిత్యము మనస్సులో దుఃఖపడువాడు, సర్వశాస్త్రములను గురించి తెలుసుకొను ప్రయత్నము చేయువాడు అగును.

పంచమమందున్న జాతకుడు స్వల్పసంతానము గలవాడు, ధనహీనుడు, గురుత్వము గలవాడు, సర్వభక్షకుడు, మిత్రులచేత మంత్రబలముచేత విడువబడిన వాడునగును.

షష్ఠభావములో నున్నప్పుడు బలవంతుడు, శత్రువులను సంహరించు వాడు,విశేషమైన తేజస్సు గలవాడు, కీర్తిగలవాడు, రోగములు లేనివాడు అగును.

సప్తమభావములో నున్న ధనహీనుడు, కాముకుడు, ఇతరులభార్యను పొందగోరు వాడు , తేజోహీనుడు అగును.

ఎనిమిదవ భావములో నున్నచో పరాక్రమము లేనివాడు, ఉత్సాహవంతుడు, సత్యమును గురించి వాదించువాడు, అప్రియుడు, కఠినముగ మాట్లాడువాడు, ప్రభువు అగును.

భాగ్యభావమందున్న యెడల పుత్ర సౌభాగ్యము గలవాడు, ధనవంతుడు, అభిమాని, దయాస్వభావము గలవాడు, బంధుప్రీతిగలవాడు అగును.

దశమభావమందున్నప్పుడు సుతులు, సౌభాగ్యముగలవాడు, సంతోషముతో కూడినవాడు, బుద్ధిమంతుడు, సుఖము గలవాడు, సత్యమైన మార్గముననుసరించువాడు అగును.

ఏకాదశమందున్నచో ధనము, ధాన్యము, బంగారము గలవాడు, రూపవంతుడు, కళలందు నేర్పరి, నీతిమంతుడు, సంగీతమందు పాండిత్యము గలవాడు అగును.

ద్వాదశ భావమందున్నప్పుడు పాపకర్మలు చేయువాడు, ఇతరుల భార్యలతో వుండువాడు, వ్యసనపరుడు, దయలేనివాడు, కపటము గలవాడు అగును.

## వ్యతీపాతఫలమ్

లగ్నమందు పాతయను గ్రహమున్నచో జాతకుడు దుఃఖపీడితుడు, క్రూరుడు, ప్రాణహింస చేయువాడు, మూర్ఖుడు, బంధుద్వేషి యగును.

ద్వితీయమందు కుటిలుడు, పైత్యము గలవాడు, భోగి,నిర్దయుడు, కృతఘ్నుడు దుష్టస్వభావము గలవాడు, పాపకార్యములను చేయువాడు నగును.

తృతీయమందు స్థిరప్రజ్ఞ గలవాడు, యుద్ధాభిలాషి, దాతృత్వము గలవాడు, ధనాఢ్యుడు, రాజవల్లభుడు, సేనాధిపతి యగును.

చతుర్థయందున్నప్పుడు బంధనము, వ్యాధిపీడితుడు ,సుత,సౌభాగ్యములు లేనివాడు నగును.

పంచమమందున్నప్పుడు దరిద్రుడు, రూపవంతుడు, కఠినముగ మాట్లాడువాడు, సిగ్గు లేనివాడు అగును.

షష్ఠభావమందు శత్రుహంతకుడు, పుష్టిగలవాడు, సమస్తములైన అస్త్రములు ప్రయోగించువాడు, కళానైపుణ్యము గలవాడు, శాంతుడు అగును.

సప్తమభావమందు ధనపుత్ర కళత్రవర్జితుడు, స్త్రీలచే జయింపబడినవాడు, దుఃఖితుడు, లజ్జాహీనుడు, పరులయందు సుహృద్భావము గలవాడగును.

అష్టమమందు వికలములైన నేత్రములు గలవాడు, రూపహీనుడు, బ్రాహ్మణనింద చేయువాడు, రక్తదోషములు గలవాడు అగును.

నవమమందున్న యెడల విశేషవ్యాపారములు చేయువాడు, అధికమిత్రులు గలవాడు, విజ్ఞానవంతుడు, స్త్రీలకు యిష్టుడు, ప్రియముగ మాట్లాడువాడు అగును.

దశమమందు జాతకుడు ధనవంతుడు,ధర్మాత్ముడు, శాంతచిత్తుడు, ధర్మజ్ఞాని, తెలిసినవాడు, ప్రాజ్ఞుడు, విచక్షణ జ్ఞానము గలవాడు అగును.

ఏకాదశ స్థానమందున్నప్పుడు విశేషధనము గలవాడు, అభిమానము గలవాడు, సత్యమునే పలుకువాడు, దృఢవ్రతుడు, అశ్వాది వాహనములు గలవాడు, సంగీతాది విద్యలందు నేర్పరి యగును.

ద్వాదశస్థానములోనుండగ బుట్టినవాడు కోపముగలవాడు, శ్రమ అధికంగా చేయువాడు, ధర్మదూషకుడు, బంధుద్వేషి, వికలాంగుడు అగును.

## పరిధి ఫలము(పరివేష)

లగ్నమందున్న యెడల విద్వాంసుడు, సత్యమును మాట్లాడువాడు, శాంతుడు, ధనవంతుడు, పుత్రవంతుడు, పరిశుద్ధుడు, దాతృత్వము గలవాడు, గురువాత్సల్యమును పొందువాడు నగును.

ధనభావమందున్నచో సర్వాధికారి రూపవంతుడు, భోగి, సుఖి , ధర్మపరాయణుడు, ప్రభువును అగును.

తృతీయమందున్న యెడల స్త్రీ వల్లభుడు, మంచి రూపముగలవాడు, దేవతలయందు స్వజనమునందు ప్రీతి గలవాడు, భృత్యుడు, గురుభక్తి గలవాడు అగును.

చతుర్థభావమందు ఆశ్చర్యపడు స్వభావము గలవాడు, ఎక్కువగా శుభకార్యములు చేయువాడు, సౌమ్యుడు, సంగీతవిద్వాంసుడు అగును.

ఉపగ్రహము పంచమభావ మందున్నచో ధనవంతుడు, శీలవంతుడు, మనోహరరూపము గలవాడు, ప్రియమైనవాడు, ధర్మాత్ముడు, స్త్రీలకు యిష్టుడు అగును.

షష్ఠభావమందు జాతకుడు పండితుడు, ధని, పుత్రులు, భోగములు కలవాడు, సర్వహితమును

గోరువాడు, శత్రువులు లేనివాడు అగును.

సప్తమభావమందుండగ బుట్టినవాడు, స్వల్పసంతానము గలవాడు, సుఖము లేనివాడు, మందప్రజ్ఞుడు, పరుషవాక్కు గలవాడు, అనారోగ్య భార్యగలవాడు అగును.

అష్టమమందుండగా పుట్టినవాడు అధ్యాత్మిక చింతనము గలవాడు, శాంతస్వభావి, , దృఢమైన శరీరము గలవాడు, దృఢవ్రతుడు, ధర్మబుద్ధి గలవాడు, బలాఢ్యుడు అగును.

నవమమందు సుఖమును అనుభవించువాడు, రూపవంతుడు, ధనవంతుడు, అభిమానవంతుడు, స్వల్పసంతుష్టి గలవాడు అగును.

దశమ భావమునందున్న జాతకుడు కాలాభిజ్ఞః, భోగి, దృఢశరీరి, మత్సరము లేనివాడు, శాస్త్ర రహస్యములు తెలుసుకొనినవాడు అగును.

ఏకాదశమందున్న స్త్రీ సౌఖ్యము గలవాడు, గుణవంతుడు, బుద్ధిమంతుడు, స్వజనప్రియుడు, అజీర్ణము గలవాడు నగును.

ద్వాదశమందున్న యెడల ఆ జాతకుడు వ్యయశీలుడు, దుఃఖముల నొందువాడు, దుష్టబుద్ధి గలవాడు గురునింద చేయువాడు అగును.

## ఇంద్రచాపఫలము

లగ్నమందు ఉపగ్రహమున్న జాతకుడు ధన, ధాన్య, హిరణ్యములు గలవాడు, కృతజ్ఞుడు సత్పురుషులచే కొనియాడబడువాడు, దోషములు లేనివాడు అగును.

ధనభావ మందున్నయెడల ప్రియమును పలుకువాడు, ప్రగల్భవచనములు పలుకు వాడు, నీతిమంతుడు, విద్యావంతుడు, రూపవంతుడు, ధర్మతత్పరుడు అగును.

తృతీయమందు యెడల అనేక కళలందు నేర్పుగలవాడు, దొంగతనమందు అసక్తికలవాడు అంగవైకల్యము గలవాడు, మిత్రులు లేనివాడు అగును.

చతుర్థభావమందున్న సుఖమును పొందువాడు, గోవులు, ధనము, ధాన్యాదులు గలిగి, ప్రభుసన్మానములచే పూజింపబడువాడు, రోగములు లేనివాడు అగును.

పంచమభావములో దూరముగ ఆలోచన చేయువాడు, మనోహరరూపము గలవాడు, దేవతాభక్తుడు, ప్రియముగ మాట్లాడువాడు, సర్వకార్యములందును వృద్ధి పొందువాగు అగును.

షష్ఠభావమందు ఉన్నచో శత్రువులను జయించువాడు, అతిధూర్తుడు, సుఖవంతుడు, అందమైనవాడు, స్వచ్ఛముగనుండువాడు, సర్వకర్మలందు సమృద్ధియగు ఫలమునొందువాడు యగును.

సప్తమభావమందున్న యెడల సర్వాధికారి, గుణములతో నిండినవాడు, శాస్త్రజ్ఞుడు, ధార్మికుడు, అందరకు ఇష్టమైనవాడు అగును.

అష్టమమందు జాతకుడు, ఇతరుల పనులయందాసక్తి గలవాడు, క్రూరుడు, పరదారాసక్తుడు వికలాంగుడు అగును.

భాగ్యమందు యెడల తపస్వి, వ్రతములనాచరించుటయందు నిరతుడు, విద్యాధికుడు లోకప్రసిద్ధుడు అగును.

దశమమందు జాతకుడు పుత్రులు, ధనము, ఐశ్వర్యము గలవాడు, పశుసంపద గలవాడు, లోకప్రసిద్ధుడు అగును.

ఏకాదశమందు యెడల లాభము గలవాడు, రోగములు లేనివాడు, దృఢమైన కోపము గలవాడు, మంత్రములు, అస్త్రములు తెలిసినవాడు అగును.

ద్వాదశమందు జాతకుడు ఖలుడు, దురభిమాని, దుర్బుద్ధి గలవాడు, సిగ్గులేనివాడు, పరస్త్రీలయందనురక్తి గలవాడు, ధనహీనుడు అగును.

## ఉపకేతు ఫలము

జన్మలగ్నమందున్న యెడల సమస్త విద్యలందు కుశలుడు, సుఖవంతుడు, వాక్చాతుర్యము గలవాడు, ఇష్టుడు, సమస్తమైన కోరికలతో కూడినవాడు నగును.

ద్వితీయమందు జనప్రియముగ మాట్లాడువాడు, మంచి కాంతిగల శరీరముగలవాడు, కావ్యములు వ్రాయువాడు, పండితుడు, అభిమానము, నీతి, వాహనములు గలవాడు నగును.

తృతీయమందు గల జాతకుడు లోభి, క్రూరకర్మములను చేయువాడు, శుష్కించిన దేహముగలవాడు, ధనహీనుడు, వ్యాధిపీడితుడు

చతుర్థమందు యెడల రూపవంతుడు, గుణవంతుడు, సాత్వికుడు, వేదములందు ప్రీతిగలవాడు, సదాసుఖమును బొందువాడు అగును.

పంచమమందు యెడల భోగవంతుడు, భోగి, కళలందు నేర్పరి, యుక్తి తెలిసినవాడు, మతిమంతుడు, మంచివక్త, గురుభక్తి కలవాడు నగును.

షష్ఠభావమందు మాతృబంధువర్గము లేనివాడు, శత్రువులు లేనివాడు, ఎక్కువ బంధువులు గలవాడు, శూరుడు, అందమైనవాడు, అగును.

సప్తమభావమందు జూదరి, కాముకుడు, భోగములననుభవించు వాడు వేశ్యాలోలుడగును.

అష్టమమందు యెడల నీచకర్మలను చేయువాడు, పాపి, లజ్జాహీనుడు, పరులను నిందించువాడు, భార్యతరపు బంధువర్గము లేనివాడు అగును.

నవమందు యెడల లింగధారణ చేయువాడు, ప్రసన్న హృదయుడు, సమస్తభూతములకు హితమును కోరువాడు, ధర్మకార్యములను తెలిసినవాడు అగును.

దశమమందు యెడల సుఖభాగ్యములు గలవాడు, స్త్రీజన వల్లభుడు, దాత, బ్రాహ్మణులతో గూడినవాడు అగును.

ఏకాదశ భావమందు యెడల నిత్యము లాభము గలవాడు, ధర్మపరుడు, పూజితుడు, ధని, సుందరుడు, శూరుడు, క్రతువులు చేయువాడు.

ద్వాదశమందు పాపకర్మలను చేయువాడు, పితృ దేవతా క్రియలు చేయనివాడు, దయలేనివాడు, పరభార్యాసక్తుడు, రౌద్రస్వభావము గలవాడు నగును.

## గుళిక ఫలము

లగ్నమందు రోగార్తుడు, కాముకుడు, పాపబుద్ధి గలవాడు, మూర్ఖుడు, దుష్టస్వభావము గలవాడు, ఎక్కువ దుఃఖములు గలవాడు అగును.

ద్వితీయమందు వికృతరూపము గల వాడు, దుఃఖితుడు, దుర్మార్గుడు, వ్యసనపరుడు, లజ్జా హీనుడు, ధనము లేనివాడు అగును.

తృతీయభావమందున్నప్పుడు అందమైన శరీరావయవములు గలవాడు, గ్రామాధిపతి, పుణ్యముతో గూడినవాడు, సజ్జనులకు ఇష్టుడు, రాజపూజితుడు అగును.

చతుర్థమందు రోగవంతుడు, సుఖము లేనివాడు, పాపకృత్యములను చేయువాడు, వాతపిత్తము లధికముగ గల శరీర ప్రకృతి గలవాడు అగును.

పంచమమందు పొగడ్తలు ఇష్టపడనివాడు, ధనహీనుడు, అల్పాయువు, నపుంసకుడు, నాస్తికుడు.

షష్ఠమందున్నప్పుడు శత్రువులు లేనివాడు, పుష్టిగల శరీరము గలవాడు, కాంతితో కూడినవాడు, స్త్రీ వల్లభుడు, ఉత్సాహవంతుడు, దృఢశరీరి.

సప్తమమందున్న యెడల స్త్రీలచే జయింపబడినవాడు, పాపకర్మలను చేయువాడు, జారుడు, కృశించిన అంగములుగలవాడు, మిత్రులు లేనివాడు, స్త్రీ ధనము చేతనే జీవించువాడు అగును.

అష్టమ భావమందుండగ బుట్టినవాడు, అధిక ఆకలి గలవాడు, దుఃఖితుడు, క్రూరుడు, ఎక్కువ రోషము గలవాడు, సిగ్గులేనివాడు, ధనము లేనివాడు, గుణహీనుడును అగును.

నవమమందున్న యెడల ఎక్కువ క్లేశములు గలవాడు, కృశించిన శరీరముగలవాడు, దుష్టకర్మలు చేయువాడు, లజ్జాహీనుడు, మందబుద్ధి, లోభి, వేషగాంభీర్యము గలవాడు నగునగు.

దశమమందున్న సుఖవంతుడు, మృష్టాన్నభోజనం చేయువాడు, దేవతలను, అగ్నిని పూజించువాడు, యోగధర్మాశ్రితుడు,

ఏకాదశమందున్నప్పుడు సుఖి, భోగి, ప్రజాధ్యక్షుడు, బలహీనుడు, బంధువులకు ఉపయోగపడు వాడు.

ద్వాదశమందున్నప్పుడు నీచకర్మలు చేయువాడు, పాపి, హీనాంగః

ప్రాణప్రద ఫలము

లగ్నమందు వున్నచో తేజోహీనుడు, మూగవాడు, పిచ్చివాడు, బలహీనములైన అవయవములు కలవాడు, సన్ననివాడు.

ద్వితీయమందు వున్న బహుధనధాన్యవంతుడు, సేవకాజనులు కలవాడు, సుందరుడు.

తృతీయమందు వున్న హింసచేయువాడు, గర్వము కలవాడు, కఠినచిత్తుడు, నిష్ఠుర వాక్యములు పలుకువాడు, గురుభక్తి లేనివాడు.

చతుర్థమందు వున్నప్పుడు సుఖవంతుడు, సుందరుడు, గురుభక్తి కలవాడు, శాంతచిత్తుడు, సత్యము పలుకువాడు.

పంచమమందు వున్నప్పుడు మంచి పనులు చేయువాడు, సమస్తమునందు కోరిక అధికముగా కలవాడు.

షష్ఠమమందున్నప్పుడు బంధువులకు, శత్రువులకు వశమగువాడు, నిర్దయుడు, రోగి, ధనవంతుడు, అల్పాయువు.

సప్తమమందున్నప్పుడు ఈర్ష్య గలవాడు, ఎప్పుడూ కామముతో వ్యవహరించువాడు, భయంకరమైన శరీరం కలవాడు, దుష్టబుద్ధి.

అష్టమమందున్నప్పుడు రోగి, భూమి, గృహము, సేవకులు, బంధువులు పిల్లలు వలన ఇబ్బంది పడువాడు.

తొమ్మిదివ ఇంట్లో వున్నప్పుడు పుత్రవంతుడు, ధనవంతుడు, సత్ప్రవర్తకుడు, పండితుడు.

దశమములో వున్నప్పుడు వీర్యవంతుడు, బుద్ధిమంతుడు, కార్యదక్షుడు, రాజకార్యములు చేయువాడు, దేవతారాధన చేయువాడు.

ఏకాదవమందు వున్నప్పుడు కీర్తిగలవాడు, గుణవంతుడు, ప్రజ్ఞ గలవాడు, భోగి, ధనవంతుడు. అందమైన అవయవములు కలవాడు.

ద్వాదశమందున్నప్పుడు నీచుడు, దుష్టుడు, అంగవైకల్యము గలవాడు, నేత్రరోగము గలవాడు.

## గోచార ఫలాధ్యాయః

పుట్టిన సమయము తేదీ ఆధారంగా నిర్ణయింపబడిన చంద్రలగ్నము, జన్మలగ్నములలో చంద్ర లగ్నమును ఆధారం చేసుకొని గోచార ఫలితములు నిర్ణయింపవలెను. పుట్టిన సమయ ఆధారంగా వున్న గ్రహసంచారమును బట్టి లగ్నాత్తు గ్రహస్థితి చంద్రలగ్నాత్తు గ్రహస్థితుల ఆధారంగా జాతక ఫలితాలు చెబుతాము. అయితే ఫలదీపికలో

సర్వేషు లగ్నేష్వపి సత్సుచంద్రలగ్నాం ప్రధానం ఖలు గోచరేషు

తస్మాత్తదృక్షాదపి వర్తమాన గ్రహేంద్ర చారైః కథమేత్ఫలాని

గోచార ఫలితములు తెలిపేటప్పుడు అన్ని లగ్నములలోను చంద్రలగ్నమే ముఖ్యమయినది అని తెలిపిరి. అంతేకాక జాతక ఫలితాధ్యయన విషయమై " కాలామృతం"లో "లగ్నం ప్రాణమయం శశిస్థ భవనం దేహస్తయోస్తత్ఫలమ్ " అని చెప్పబడినది. అనగా జాతక ఫలితాధ్యయనముకు

జన్మలగ్నం ప్రాణం వంటిది. చంద్ర స్థితరాశి (జన్మకాలముకు) శరీరము వంటిది. శరీరం వుండి ప్రాణం లేకపోయినా, ప్రాణం వుండి శరీరం లేకపోయినా ఫలితం అర్ధరహితం. కావున జన్మలగ్నం చంద్రలగ్నం రెంటినీ పరిశీలించాలి. ఈ విషయమును సమర్థిస్తూ " దేవ కేరళ " గ్రంధమందు కూడా ఈ వివరణ వున్నది.

ఈ గోచార ఫలిత అధ్యయనముకు మన పూర్వులు అందించిన గ్రంధాలలో" మంత్రేశ్వరప్రణీత ఫల దీపిక " బాగా ఉపయుక్తముగా వుంటుంది. అందులో జన్మలగ్నాత్-దశాంతర్దశా ఫలితములకు చంద్రలగ్నాత్ గోచార ఫలితములకు సంబంధం చెబుతూ యిరవదవ అధ్యాయంలో (దశాపహార యోర్విశేషఫలం)

"యద్భావగో గోచరతో విలగ్నాత్ దశేశ్వరః స్వోచ్చసృహుద్ గృహస్థః
తద్భావ పుష్టిం కురుతే తదానీం బలాన్వితశ్చే జ్జననేపి తస్య "

ఏదేని గ్రహదశ నడుచుచుండగా ఆ దశానాధుడు ( జన్మ లగ్నాత్ బలవంతుడై మరియు ఆ గ్రహము (గ్రహదశా సమయంలో) గోచార విషయంలో స్వక్షేత్ర మిత్ర క్షేత్ర, ఉచ్ఛ క్షేత్రాదులలో బలవంతుడై వుండిన ఎడల ఆ భావముకు మేలు చేయును. ఇక్కడ భావముఅనగా జన్మలగ్నాత్ మాత్రమే చూడవలెను.

బలోనితో జన్మని పాకనాథో మౌఢ్యం స్వనీచం రిపుమందిరం వా
ప్రాప్తశ్చ యద్భావ ముపై తిచరాత్ తద్భావనాశం కురుతే తదానీయ్

జన్మలగ్నాత్ ఏ భావాధిపతి నిర్బలుడై వుండునో అనగా శత్రుస్థాన స్థితి, నీచస్థాన స్థితి అస్తమయాది దోషములతో వుండునో ఆభావాధిపతి దశ నడుచుచుండగా ఆ దశా సమయంలో గోచారవశాత్ కూడా ఆ భావాధిపతి నిర్బలుడైనచో ఆ భావముకు నాశము కలుగును.

ఈ రెండు సూత్రాల ఆధారంగా పరిశీలిస్తే

1 జన్మలగ్నాత్ దశానాధుడు బలంగా వుండి ఆ దశానాధుడు గోచారంలో బలహీనుడైన ఎడల ఆ దశానాధునికి సంబంధించిన భావ ఫలితాలు పూర్తి అనుకూలంగా వుండవు.

2 జన్మలగ్నాత్ దశానాధుడు అశుభస్థాన స్థితుడై వుండి ఆ దశానాధుడు గోచారవశాత్ శుభస్థాన స్థితుడైన ఎడల ఆ దశానాధునికి సంబంధించిన ఫలితాలు పూర్తి ప్రతికూలంగా వుండవు.., అని వూహించవచ్చు.

## గోచార గ్రహాలు ఫలితాలను ఎప్పుడు యిస్తాయి ?

ఉదాహరణకు శనిగోచారవశాత్ జన్మంలో వుంటే రోగములు వస్తాయి అని వున్నది. అయితే ఆ రెండున్నర సంవత్సరాలు పూర్తిగా అనారోగ్యము వుంటుందా ? లేదా ? అసలు రెండున్నర సంవత్సరాల

కాలంలో 'శని' ఎప్పుడు అనారోగ్యఫలితాన్ని యిస్తారు... యిలాంటి వాటికి కూడా ఫలదీపిక నుండి సమాధానము వున్నది.

క్షితి తనయపతంగే రాశిపూర్వత్రిభాగే సురపతిగురుశుక్రౌ రాశిమధ్యత్రిభాగే ।

తుహినకిరణమందే రాశిపాశ్చాత్యభాగే శశితనయ భుజంగే పాక దౌసర్వకాలమ్ ॥

రవికుజులు రాశిలో మొదటి ద్రేక్కాణములో వుండగానే ఫలితమును యిచ్చెదరు. అనగా మొదటి మూడుపాదములు సంచరించే కాలంలోనే గురుశుక్రులు రాశిలోని ద్వితీయ ద్రేక్కాణ సంచారకాలంలో అనగా రాశిలోని 4,5,6పాదముల సంచార కాలంలో ఫలములొసంగుదురు. శనిచంద్రులు రాశ్యంత భాగంలో వుండగా చివరి మూడు పాదముల సంచార కాలంలో వుండగా ఫలితమును యిచ్చెదరు. బుధ రాహువుల ప్రభావం మాత్రం రాశిలో పూర్తి సంచారకాలమంతా ఫలితమును యిచ్చెదరు.

దీన్ని బట్టి పరిశీలించగా కేవలం జన్మలగ్నమును బట్టి లేదా కేవలం గోచారమును బట్టి ఫలితం నిర్దేశించుటలో శ్రమ ఎక్కువ వున్నది. రెంటిమీద ఆధారం చేసుకొని ఫలితం చెప్పుట శ్రేయోదాయకము.

### రవియొక్క శుభవేధాస్థానములు

లాభ విక్రమఖ శత్రుషుస్థితః శోభతో నిగదితో దివాకరః ।

ఖేచరై స్సుతతపో జలాన్త్య గైర్వ్యా కిభిర్యదిన విధ్యతే తదా ॥

జన్మరాశి నుండి రవి 11,3,10,6 లలో వుండగా శనిగాకుండా మిగతా గ్రహములు వరుసగా 5,9,4,12 లలో వున్నచో విద్ధ ఏర్పడును.

### చంద్రునియొక్క శుభవేధాస్థానములు

ద్యూనజన్మ దిపులాభఖత్రగశ్శన్ద్రమారి శుభఫలప్రదస్తరా ।

స్వాత్మజాన్త్య మృతిబన్ధు ధర్మగైః విధ్యతే నవిబుధైర్యదిగ్రహైః ॥

జన్మరాశి నుండి చంద్రుడు 7,1,6,11,10,3 లలో వుండగా బుధుడు గాకుండా మిగతా గ్రహములు వరుసగా 2,5,12,8,4,9 లలో వున్నచో విద్ధ ఏర్పడును.

### కుజుని శని యొక్క శుభవేధాస్థానములు

విక్రమాయరి ప్రగః శుభరికుజః స్వాత్త్ర దాన్త్య సుతధర్మ గైఃఖగైః ।

చేన్న విద్ధ ఇనసూనురప్యసౌ కింతుధర్మగుణజనాన విధ్యతే ॥

జన్మరాశి నుండి కుజుడు,శని 3,11,6 లలో వుండగా మిగతా గ్రహములు వరుసగా 12,5,9 లలో వున్నచో విద్ధ ఏర్పడును.

### బుధుని యొక్క శుభవేధాస్థానములు

స్వాంబు శత్రుమృతి భాయగశ్శుభోజ్ఞ శ్శస్తదానఖలు విధ్యతే తదా ।

ఆత్మజత్రితయ ఆద్యనైధనప్రాన్త్య గైర్విధుభిర్నభశ్చరైః ॥

జన్మరాశి నుండి బుధుడు 2,4,6,8,10,11 లలో వుండగా మిగతా గ్రహములు వరుసగా 5,3,1,8,9,12 లలో వున్నచో విద్ధ ఏర్పడును.

## గురుని యొక్క శుభవేధాస్థానములు

స్వాయధర్మ తనయద్యునస్థితో నాయకపురోహితః శుభః ।

రిఃఫరన్ధ్రఖజల త్రిగైర్యదా విద్యతే గగనచారిభిర్నహి ॥

జన్మరాశి నుండి గురువు 2,11,9,5,7 లలో వుండగా మిగతా గ్రహములు వరుసగా 12,8,10,4,3 లలో వున్నచో విద్ధ ఏర్పడును.

## శుక్రుని యొక్క శుభవేధాస్థానములు

ఆసుతాష్టమతపోవ్యయాయగో విద్వ ఆస్పు జిదశోభన స్మృతః

నైధనాస్తతను కర్మధర్మధీలాభవైరీసహ జస్థ ఖేచరైః ॥

జన్మరాశి నుండి శుక్రుడు 1,2,3,4,5,8,9 11,12 లలో వుండగా మిగతా గ్రహములు వరుసగా 8,7,1,10,9,5,11,6,3 లలో వున్నచో విద్ధ ఏర్పడును.

## గోచార రీత్యా గ్రహములకు వేధాస్థానములు

| | వేధాస్థానములు | శుభస్థానములు |
|---|---|---|
| రవికి | 4-5-9-12 | 3,6,10,11 |
| చంద్రునికి | 2,5,12,-8-4-9 | 1,7,6,11,10,3 |
| కుజునికి | 5-9-12 | 3,6,11 |
| బుధునికి | 1,3,5,8,12 | 2,4,6,8,10,11 |
| గురునికి | 12,8,10,4,3 | 2,11,9,5,7 |
| శుక్రునికి | 1,7,8,9,10,11,3,5,6 | 1,2,3,4,5,8,9,11,12 |
| శనికి | 5-9-2 | 3,6,11 |

**ఉదా** - కుజుడు గోచారవశాత్ 3,6,11 స్థానములయందుండగా శుభుడు అయితే అదే సమయంలో 5,9,12 స్థానములలో మరి ఏ యితర గ్రహము వున్నను ఈ శుభ ఫలితములు యిచ్చు కుజునికి వేధ కలుగును. కావున ఫలితములు ఈయజాలడు.

అయితే ముహూర్త చింతామణి 4వ ప్రకరణంలో

దృష్టా పి భౌంటే విపరీతవేధా చ్ఛుభో ద్వికోణౌ శుభదః సితేబ్జః

శుభ ఫలితములు ఈయవలసిన గ్రహములకు వేధ కారణంగా శుభఫలితములు యివ్వలేని స్థితి అలాగే అశుభ స్థాన స్థిత గ్రహములకు ఆయా వేధాస్థానములలో వున్న వేధా గ్రహముల వలన

అశుభ ఫలితములు తొలగడము జరుగుతాయి.

## ఏలినాటి శని

ద్వాదశే జన్మగే రాశౌ ద్వితీయేచ శనైశ్చరః

సార్ధాని సప్రవర్షాణి తదా దుఃఖైర్యుతోభవేత్ ॥

గోచారవశాత్ శని చంద్రరాశికి 12వ ఇంట, 1వ ఇంట, 2వ ఇంట, తిరుగాడు సమయమందు ఆ కాలమును ఏలినాటి శని అంటారు. శనికి ఒక్కొక్క రాశిలో 21/2 సంవత్సరములు ఉంటారు గనుక పైన చెప్పిన3 రాశులలోను 71/2 సంవత్సరాలు ఉంటారు. దీనినే ఏలినాటి శని అంటారు.

## మూర్తి నిర్ణయం

గ్రహము తనయొక్క రాశి ప్రవేశకాల నక్షత్రమును బట్టి మూర్తినిర్ణయింపబడును. రాశి అనగా ప్రవేశకాల రాశి జన్మరాశి నుండి 1-6-11 రాశులలోది అయిన ఆ గ్రహము సువర్ణమూర్తి అని 2-5-9 స్థానములైన రజతమూర్తి 3-7-10 స్థానములయిన తామ్రమూర్తి 4-8-12 స్థానములయిన లోహమూర్తి అని నిశ్చయించారు. ఉదా:- మేషరాశి జన్మరాశి హస్త నక్షత్ర దినమున శని కుంభంలో ప్రవేశిస్తున్నారు. అనగా ప్రవేశకాలరాశి కన్య మేషరాశికి కన్య ఆరవరాశి కావున కుంభంలో ప్రవేశించిన శని సువర్ణమూర్తి అయినారు. సువర్ణ, రజిత మూర్తులయిన గ్రహములు చెడు ఫలితములు యివ్వవలసిన స్థానంలో వున్నప్పటికీ చెడు ఫలితములు యివ్వరనీ, మంచి ఫలితములు యివ్వవలసిన స్థానంలో వున్న గ్రహం తామ్ర లోహమూర్తి అయినచో మంచి ఫలితములు పూర్తిగా అందవనీ ఒక వాదన వున్నది.

### రవి

1. శరీరబాధ,మనోబాధ,అకాల భోజనం,సకల విరోధము,అనారోగ్యం,స్థానచలనం,కలహప్రాప్తి అనవసర ప్రయాణములు, సానుకూల ఫలితములకు అడ్డంకులు రావడం.
2. నీచత్వము,దుర్మార్గులమాట,గాయపుబాధ,తలనొప్పి,నేత్రబాధ,వృత్తినష్టాలు,వంచన,మోసం, తక్కువ ఆదాయం ఎక్కువ ఖర్చు.
3. రోగనాశనం,సుఖం,మనోల్లాసం,బంధుమిత్రకలయిక,ధనప్రాప్తి,ఇష్టకార్యసిద్ధి,పుత్రసౌఖ్యము,
4. హృదయతాపం,గృహకలహాలు,సుఖనష్టం,భోజన అసౌకర్యం, ప్రతికార్యమందు అలస్యము ప్రయాణవిఘ్నం, రోగపీడ, కార్య నష్టం, గృహచ్ఛిద్రం.
5. సోమరితనం,హృదయతాపం,స్నేహితులద్వారా కష్టం,ధనవ్యయం,బుద్ధిమాంద్యం,శత్రుభీతి.
6. సుఖము, ప్రయత్నకార్య సిద్ధి, శత్రువులపై జయము, సంతోషం, మంచి ఆరోగ్యం , వస్త్రలాభము,ధాన్యలాభము.
7. యింటికిగాని క్షేత్రముకుగాని సంబంధీకులతో శతృత్వము, భార్యపీడ, పుత్రవ్యాధి, ఆర్థిక చికాకులు

, ఉత్సాహ భంగము, రొమ్మునొప్పి, కడుపు నొప్పి

8 చెడుపనుల దోషము, శతృకలహము, రాకపోకలవలనబాధ, దుఃఖవార్తా శ్రవణం, గర్వకుటిలత, భార్యతో అపోహలు.

9 తన ప్రమేయం లేకుండానే కలహము, అధిక ధనవ్యయము, శుభ (పుణ్య) కార్య నాశనం, ద్రవ్యం తరిగి పోవుట, మనోవిచారము.

10 ద్రవ్యము దొరుకుట, సదా ఆరోగ్యము, బంధుమిత్ర కలయిక, రాజదర్శనం, మంచి సౌఖ్యము, పెద్దలచే గౌరవం, ఆదరణ, కోర్కెలు నెరవేరుట.

11 ద్రవ్యలాభం, కులాచార ప్రవర్తన, ఇంట్లో ఉత్సవం, శుభకార్యములు చేయుట, ప్రతిదినము జయము, గృహనిర్మాణం, సుఖప్రాప్తి, వ్యాధినుండి స్వస్థత, అభివృద్ధి, శీఘ్రకార్య జయము.

12 స్థానభ్రష్టత్వము, బంధువులకు రోగము, ధనవ్యయము, ప్రాణహాని, ఉష్ణప్రకోపం, వృధా ప్రయాణాలు, నిరుత్సాహకరముగా నుండుట.

### చంద్ర

1 ఆరోగ్యం, శరీరసుఖము, సంతోషము, ద్రవ్యము, గౌరవము, సౌఖ్యములు, మంచి ఆహారము, బట్టలు, స్త్రీ సంపర్కమందు ఉత్సాహము.

2 వ్యయం, మనఃక్లేశము, సర్వదోషములు, అకాలభోజనం, ఇబ్బందులు పెరుగుట, దేహబాధ.

3 లాభం, వస్త్రలాభము, మనఃసౌఖ్యం, నూతనస్త్రీ పరిచయం, కుటుంబసౌఖ్యం.

4 మనోచాంచల్యం, బంధువైరం, మానసిక అశాంతి, ఇతరులలో నమ్మకం పోవుట, స్వయంగా కార్యములు చెడగొట్టుకొనుట.

5 అనారోగ్యం, వాతరోగము, మనోవ్యధ, భీతి, కార్యనాశము లేదా ధననాశము.

6 సంతోషం, స్వస్థానప్రాప్తి, శత్రువులపై జయము, ధనలాభము, కీర్తి.

7 ఆకస్మిక ఆదాయం, స్త్రీ సౌఖ్యం, శరీరసౌఖ్యం,

8 వ్యాకులత, అజీర్ణవ్యాధి, మోకాళ్లనొప్పులు, అకారణభయం, అనుకూలము లేని భోజనము చేయుట.

9 వస్త్రనాశం, పుత్రవైరం, దూరప్రాంతవాసం, రోగబాధ, వుద్యోగంలో చికాకు.

10 ఆరోగ్యం, ఉన్నతపదవి, అధికారం, యత్నకార్యసిద్ధి, మృష్టాన్న భోజనప్రాప్తి.

11 మనఃసౌఖ్యము, కొత్తస్నేహితులు, మంచి ఆదాయము, ధాన్యలాభము.

12 వాహనగండము, ఖర్చు పెరుగుదల, బంధువైరము.

### కుజుడు

1 జ్వరము, గాయాలు, భార్యాబంధు విరోధం,భూతబాధ,అప్రయత్న ప్రయాణం, ప్రమాదములు, శత్రుబాధ

2 దేహంలో బలహీనత, మనఃక్లేశము, కార్యనాశనం, దుర్మార్గ సహవాసము, భయము, ద్రవ్యభంగం,

ప్రభుత్వం నుండి ఇబ్బందులు, ఉన్నతాధికారులతో ఇబ్బందులు.

3 ధనలాభము, ఆరోగ్యము, యిష్టప్రాప్తి, ధనసుఖం, వస్త్రలాభం, సర్వానుకూలత, కుటుంబ సౌఖ్యం.

4 భాగ్యం తగ్గుట, క్రూరభయం, బంధు విరోధం, ద్రవ్యనాశనం, రోగవేదన, దుర్వార్త శ్రవణం, మూలశంక వ్యాధి, రక్తస్రావం.

5 శరీరరోగం, తాపం, అకాల భోజనం, పాపకర్మం, అసంతృప్తి, పిల్లల అనారోగ్యం, శత్రుభయము.

6 వస్త్ర ధనధాన్య లాభం, కీర్తి, మనోల్లాసం, పుణ్యసంప్రాప్తం, ప్రమోషన్, అనుకోకుండా ధనము లభించును.

7 అన్నవస్త్ర నష్టం, బంధుక్లేశము, పుత్ర భ్రాతృ ద్వారా భయము, సోదరులతో కుటుంబకలహం, తెలియని శరీరబాధ, అజీర్ణవ్యాధి, నేత్రబాధ.

8 దేశాంతర వాసము, కార్యహాని, స్థాన నాశనం, ఋణావమానం, కోపము, పెరుగుట, రక్తహీనత, పరువు నష్టం.

9 అన్నవస్త్రాలు అమరకుండా శరీరం ఎండుట, నొప్పి,స్థాన భ్రష్టత్వం, ద్వేషము, కృషికి తగిన ఫలితం లేకుండుట, ఉన్నతాధికారులతో ఇబ్బందులు.

10 క్లేశము, వ్యాధి, నీరసం, ఉద్యోగరీత్యా తిరుగుట, అజీర్ణం, చివరలో కించిత్‌లాభం.

11 ఆరోగ్యం, ద్రవ్యలాభం, సంతోషం, వస్త్రలాభం, యత్నకార్యసిద్ధి, ధైర్యము,కోర్టు వ్యవహార సానుకూలత.

12 దేశాంతర వాసము, రోగవేదన, బంధుద్వేషము, ధననాశనం, శరీరపీడ, నేత్ర బాధ, నీలాప నిందలు, అధికఖర్చు, భార్యతో తగువులు.

**బుధుడు**

1 బుద్ధి వైకల్యము, బంధువైరము, అకాల భోజనం, దుర్మార్గుల కలయిక, విద్యాభంగం, వృథా తగాదాలు.

2 ద్రవ్యప్రాప్తి నగలరూపంలో, సుఖము, ఆరోగ్యం, సజ్జనగోష్ఠి, బంధువులచే అవమానము.

3 ద్రవ్య నాశనము, రాజకోపము, బంధువిరోధము, బుద్ధిమాంద్యం, మనస్తాపం.

4 మాతృసుఖము, ధనధాన్య వృద్ధి, స్వబుద్ధిచే కార్యసిద్ధి, శుభకార్య సిద్ధి, ఆనందముగా వుండుట,కుటుంబ సభ్యుల బంధువుల అభివృద్ధి.

5 అవయవముల ప్రతికూలత, భీతి, అకస్మాత్తుగా కలహసంభవం, మానసిక ఆందోళన,వాత పిత్త కఫ శ్లేష్మ అనారోగ్యము, భార్యా బిడ్డలతో తగువులు.

6 వస్త్ర ధనధాన్య లాభం, మనోధైర్యం, విద్యచే వినోదం, పేరు ప్రతిష్టలు.

7 దౌర్భాగ్యం, ద్రవ్యనాశనం, రాజకోపం, సౌందర్యహాని, సర్వాంగములు జడీభూతమగుట, మిత్ర దూరం, ఉష్ణప్రకోపం, తగువులు.

8 రోగము, హృదయతాపం, వ్యాకులత, భీతి, స్వల్పభోజన ప్రాప్తి, సంతానము కలుగుట.

9 సోమరితనం, అపకీర్తి, తనపనులచే ఇతరులకు బాధ, అయిష్ట భోజనం, గర్భరోగం, మనోవ్యధ.

10 అపవాదు, తిట్లు, భోజన అసౌకర్యం, సంతాపం, ఆదాయం పెరుగుట.

11 ఆరోగ్యం, ద్రవ్యలాభం, మనోల్లాసం, సుఖం,బ ంధుమైత్రి, కీర్తి వర్ధిల్లును, వస్తుప్రాప్తి.

12 సుఖహాని, మనోసంకటం, సేద్యము తరుగును, సదా కలహము, దారిద్ర్యము, కుటుంబవిరోధం.

## గురు

1 రాజకోపము, కీర్తిహాని, ఉద్యోగ విరోధము, బుద్ధి భ్రంశము, భాగ్యహాని, భయము, స్థానచ్యుతి, అధిక ఖర్చులు, తెలివితేటల నష్టము.

2 హృదయసుఖము, యశోవృద్ధి, సౌభాగ్యము, ధనాదాయము, ధర్మకార్యాచరణ తద్వారా సంతోషం, కుటుంబములో ఐకమత్యము.

3 అతిశ్రమ, బంధువిరోధము, ద్రవ్యలేమి, శరీరబాధ, ఉద్యోగ కార్యభంగము, జగడం.

4 యాచనము, బుద్ధి చాంచల్యము, తేజోహీనము, ద్రవ్యనాశం, దేశత్యాగం, అధిక ఖర్చు.

5 ద్రవ్యలాభం, ఐశ్వర్యము, స్వకార్యసిద్ధి, స్వబంధుకారణ సౌఖ్యం, ఉద్యోగస్థాయి పెరుగుట.

6 భార్యా పుత్ర విరోధం, చోర రాజ అగ్ని భయం, స్వజన కలహము, ధననష్టము, ఉద్యోగంలో మార్పు.

7 ఆరోగ్యము, రాజదర్శనము, స్వ శరీరపోషణము, ఇష్టకార్యసిద్ధి, ప్రయత్న భంగము.

8 చోరభయం, అగ్నిభయం, రాజభయం, దేహసౌంపు భంగం, గాంభీర్య మార్పు, క్రూరోక్తులు వచించుట, తెగువ, కోపం, భార్యా పుత్ర ఆరోగ్యం.

9 ద్రవ్యప్రాప్తి, స్వకులాచార ప్రవర్తన, గృహలాభము, సుఖభోజనము, నిత్య స్త్రీజన సంయోగం, కొత్త స్నేహములుకలుగుట, ధర్మకార్యాచరణ.

10 ధాన్యనాశం, ద్రవ్యవ్యయం, వ్యర్ధసంచారం, భయం, స్వబంధు ద్వారా దూషణం, కార్యాలస్యం, అసంతృప్తి, కోపం.

11 కీర్తివృద్ధి, బలం, తేజస్సు, సర్వత్రాభయం, సుఖం, శత్రునాశం, మంత్రసిద్ధి, ఉద్యోగంలో ప్రమోషన్.

12 శుభకార్యాచరణ మూలంగావ్యయం, ప్రాణి విక్రయం వలన దూషణం, స్థానభ్రష్టం, దారిద్ర్యం, భార్య ప్రయాణము

## శుక్రుడు

1 ద్రవ్యలాభం, మనస్సౌఖం, పరస్త్రీ సంగమం, యత్నకార్య ధనప్రాప్తి, సుఖసంతోష ప్రాప్తి

2 భార్యసుఖం, ఆరోగ్యం, స్త్రీలతో సల్లాపం, కీర్తి, శరీర సౌఖ్యం, వస్త్రలాభం,వాహన లాభం, కార్య లాభం, శృంగార సౌఖ్యం.

3 వ్యాపార ధననాశం, శత్రువృద్ధి ధననాశం, సంచారం, జీవన రాహిత్యం, త్రిప్పుట.

4 స్వేచ్ఛా ప్రవర్తన, బంధుగౌరవం, స్త్రీ సంభాషణ ప్రీతి, పుత్ర మిత్ర కళత్ర గోష్ఠి, వాహన లాభం, విద్యా

ఖివృద్ధి, శత్రువులకు అవమానం.

5 దాసీజనం కలుగుట, ఆదాయము, సుఖభోజనము, ఇష్టార్థలాభం, పెద్దలకు సుఖం, కీర్తి, పలుకుబడి పెరుగుట.

6 విరోధము, శత్రుపీడ, జ్ఞాత విరోధము, భార్యా పుత్ర కలహం.

7 తాపము, కోపము,గొప్పభయము, కష్టజీవనం, స్త్రీ రోగం, దేహ అసౌఖ్యత.

8 దుఃఖనాశం, సుఖం, బంధుమిత్ర కలయిక, ద్రవ్యలాభం, కృషిలాభం, స్త్రీల వల్ల ఇబ్బందులు.

9 వస్త్రలాభం ,విశేషారోగ్యం, కులాచార ప్రవర్తన, గురుభక్తి, ఇష్టార్థలాభం.

10 వ్యాకులత, బలహాని, ద్రవ్యనాశం, శత్రుభయం, స్త్రీ సౌఖ్యత, మతపరమైన పనులు.

11 పుష్కలంగా కాంతి, కీర్తి, యత్న కార్యసిద్ధి, అర్థలాభం, క్షీరాన్నభోజనం, వ్యాపారలాభం, తగవులు.

12 ఆయుధబాధ, చోరపీడ, కష్టం, గొప్పభయం, సర్వకార్య విఘ్నం.

**శని**

1 తేజోహాని ,మతిభ్రంశం,హృదయవ్యాధి, భీతి, రోగబాధ, బంధువైరం, దుఃఖం. భార్య అనారోగ్యము, విదేశీయానము.

2 కార్యనాశనం, త్రిప్పుట, స్వజన విరోధం, పాపచింతనం, ఆరోగ్యబాధ, కలహములు, సంపాదన సుఖము లేకపోవుట.

3 స్త్రీ సంభోగం, హృదయసుఖం, స్వబుద్ధికారణ కార్యసిద్ధి, స్వస్థలప్రాప్తి, ఆరోగ్యం, ఆగిపోయిన పనులు పూర్తగుట, సంపద పెరుగుదల.

4 వాతము వలన శూలం, మనఃక్లేశం, భీతి, స్వస్థానహాని, గృహేప్రసవం, శరీరపుష్టి నష్టం, తల్లిదండ్రుల అనారోగ్యము, అనుమానతత్వము, వంకరప్రవర్తన.

5 ఆస్తి - సంతతి నష్టం, కార్యభంగం, జ్ఞాతి - వ్యాజ్యకలాపం, హీనజాతిస్త్రీ సంభోగం తద్వారా పరితాపం, తరచు గొడవలు.

6 ధనధాన్యాది వృద్ధి, బంధుసంతోష వర్ధనం, స్త్రీ సౌఖ్యం, గృహనిర్మాణం, శత్రువునుండి స్వేచ్ఛ.

7 వ్యాధి, బాధ, దేశాంతరవాసం, హృదయమునకు కష్టం, గొప్ప భీతి, అర్థనాశం, మనస్తాపం, కుటుంబమునుండి లేదా వ్యాపారమునుండి విడిపోవుట.

8 సమస్తకార్య విరోధం, వ్యాధిపీడా, ధనక్షయం, అపమృత్యు భయప్రాప్తి, చెడుపనులు చేయుట.

9 దుఃఖం, వ్యాధి, కొన్నివేళల విశేష దుఃఖము, ఒక్కొక్కప్పుడు ధనలాభము, మరొకప్పుడు భార్య పుత్రుల కారణంగా కష్టం, సుఖము, ఆదాయము తగ్గుట, వైరమువలన బాధలు.

10 మనో వ్యాకులత, దుఃఖము వలన పరితాపము, పాపం, ఉద్యోగ విఘ్నం, కృషి మొదలగు సర్వ కార్యములకు విఘ్నములు, అనారోగ్యములు, కొత్తవృత్తి, విచారం.

11 ఆరోగ్యము, అర్థలాభం, స్త్రీ పుత్ర సుఖవర్ధనం, మనోనైర్మల్యము, ఇష్టార్థసిద్ధి.

12 మానహాని, మనఃక్లేశం, స్వల్పకృషి, స్వల్పభోజనం, ఎడతెగని పోరు, దారిద్ర్యం, ప్రమాదము, కష్టముల పరంపర, ఏలినాటి శని ప్రారంభము.

**రాహు**

1 భార్యా పుత్రులతో విరోధం, దేశ సంచారం, రోగముచే బాధ, ద్రవ్యనాశం, గొప్ప కష్టం.

2 మంగళప్రదం, ఐశ్వర్యం, దేహసౌఖ్యం, ద్రవ్యలాభం, కీర్తిప్రదం, వాక్కాఠిన్యం, సంతోషం, ధననష్టం.

3 మర్యాదహాని, మనోవిచారం, భ్రాతృద్వేషం, విశేష కష్టములు,

4 చిత్త చాంచల్యము, వాతరోగము, స్త్రీ మూలభయం, ప్రయాణ విఘ్నం.

5 పుత్రవైరం,రాజపూజ్యం,అకాలభోజనం,అందరు బాగాచూచుటయు,అందరికి పూజార్హత.

6 ధైర్యము, బుద్ధి, అధిక పరాక్రమము, శతృనాశనం, ఎల్లప్పుడు సుఖం, శతృవర్గ కారణంగా గో భూ లాభప్రాప్తి

7 స్వల్పముగా సర్వధాన్య ఫలం,వ్యర్థముగా రాకపోకలు,చేతులు, కాళ్ళు,వేళ్ళు కుష్ఠు కలిగి యుండుట.

8 శరీరబాధ, చతుష్పాద మృగముల వల్ల భయం, రాజకోపం,ప్రయాణం.

9 ఆవులు, గుఱ్ఱములు, ఏనుగులు నశించుట, ధన ధాన్యాది నాశనం, ప్రయాణక్లేశం.

10 మనస్సౌఖ్యం, సదాసంతోషం, అభీష్ట సుఖభోజనం, కర్మసిద్ధి, బలపుష్టి, దారుఢ్యం కలిగి వుండుట.

11 ఆవులు, గుఱ్ఱములు, ఏనుగులులభించుట, క్షీరాన్నాది, సుఖ భోజనం, వస్త్ర మాల్యాది లాభం.

12 దరిద్రం, ధననాశనం, నేత్రబాధ, శతృభయం, సర్వకాల విఘ్నం, ప్రవాసం

**అశ్విని**

అశ్విని నక్షత్రమున పుట్టినవానికి సింహము కన్య యీ రాసులయందు శని ఉన్నచో ఉద్యోగము వలన ధనప్రాప్తియు, క్రయవిక్రయమూలకముగ ఆదాయమును కార్యములయందు జయమును కలుగును. ధనుస్సులో శని సంచరించునప్పుడు జీవనహాని, బుద్ధివినాశనము, లోవైనమువలన ధననష్టము, మానభంగము, దేశత్యాగము, బ్రాహ్మణద్వేషము, దారిద్ర్యమును లభించును. మిధునము, కటకము ఈ రాసులయందు శని సంచరించునప్పుడు గృహమందు తిలసంబంధము గల కర్మము, ఋణబాధ, పొత్తులు కుదువపెట్టుట, గొప్ప వాతూలము ఇవి లభించును. తక్కిన రాసులు సమఫలములు,

**భరణి**

భరణి నక్షత్రమున పుట్టినవానికి మిథునములో శని సంచరించునప్పుడు, వర్తకమూలముగాఁగాని వ్యవహారమూలముగఁగాని విశేషధనలాభము, ఇతర కుటుంబసంరక్షణము, పూర్ణజయము కలుగును. మేషము, వృషభము ఈ రాసులలోకి వచ్చినప్పుడు కర్మసంబంధము, దుఃఖము కలుగును. తులకు

వచ్చెనేని, జీవనహాని, స్త్రీ మూలకముగ సొత్తుల నష్టము, ఋణబాధ, దేహజాడ్యము, స్థానభ్రంశము, మనోవ్యాకులత, దారిద్ర్యము కలుగును. కటకములో శని సంచరించునప్పుడు సహోదరనష్టము కలుగును. తక్కిన రాసులలో నందునప్పుడు సమఫలము.

## కృత్తిక

కృత్తిక నక్షత్రములోఁ పుట్టినవానికి మేషములోనికి శని వచ్చెనేని ప్రభుమూలకముగను, రాళ్ళ మూలకముగను, ఉద్యోగమూలకముగను, విశేషధనలాభము కలుగును. కుంభములో శని సంచరించునప్పుడు కర్మసంబంధము, ఋణము, వ్యాకులము, కారాగృహవీక్షణము కలుగును. సింహములో తిరుగునప్పుడు జీవనహాని, రాజకీయవ్యవహారముల వలన మానభంగము, పలాయనము, వ్యాకులము, దారిద్ర్యము, మహాకష్టము కలుగును. తక్కిన రాసులలో నుండునప్పుడు సమఫలము కలుగును.

## రోహిణి

రోహిణి నక్షత్రములోఁ పుట్టినవానికి శని కుంభమునకు వచ్చినప్పుడు నీచులమూలకముగ, సేవకావృత్తిమూలకముగ, దొంగలమూలకముగ విశేషధనమును, సంతోషము,సౌభాగ్యము - ఇవి కలుగును. ధనుస్సులో శని సంచారము చేయుచుండఁగా కర్మసంబంధము ఋణమూలకముగ వ్యాకులము కలుగును. మిథున వృషభములలో సంచరించునప్పుడు జీవనహాని, క్రూరకృత్యము - ఇవి కలుగును. తక్కిన రాసులు సమఫలములు. ఇదిగాక పైనఁజెప్పిన స్థానములలో శనియుండిన శనిదశాభుక్తులు వచ్చిన ఈ ఫలములు తప్పక జరుగును.

## మృగశిర

మృగశిర నక్షత్రములోఁ పుట్టినవానికి ధనుస్సులో శని తిరుగునప్పుడు బ్రాహ్మణమూలకముగను దేవతానిర్మాణమూలకముగను ధనలాభము, ఉద్యోగము - ఇవి కలుగును. కన్యా తులలో సంచరించు నప్పుడు కర్మసంబంధము, ఋణమూలకముగను వ్యాపారమూలకముగను నష్టము కలుగును. మీనములో శని సంచరించునప్పుడు జీవనహాని, జలగండము, విరోధము, మహాక్రూరము - ఇవి కలుగును. తక్కిన రాసులు సమఫలములు.

## ఆరుద్ర

ఆరుద్ర నక్షత్రములోఁ పుట్టినవానికి శని కన్యాతులలో సంచరించునప్పుడు క్రయవిక్రయమూలకముగ ధనప్రాప్తి, శుభమూలకసంతోషము. కటకములో సంచరించునప్పుడు జ్ఞాతినాశనము, ఋణమూలకవ్యాకులము, సింహములో సంచరించునప్పుడు కర్మసంబంధము. మకరములోనికి రాఁగా జీవనహాని, లోపయినము వలన యావదాస్తినాశము, మానభంగము, మహిషమూలకముగ గండము - ఇవి కలుగును. తక్కినరాసులు సమఫలములు.

### పునర్వసు

పునర్వసు నక్షత్రములోఁ పుట్టినవానికి శని కటకములో సంచరించునప్పుడు జలసంబంధ కార్యమువలన విశేషధనలాభము (అనగా: ఓడవర్తకమువలన ననుట)ను వృషభములో సంచరించునప్పుడు జలసంబంధకర్మము, దాయాదినాశము, ఋణబాధ, వ్యాకులము వృశ్చికములో తిరుగునప్పుడు జీవనహాని, రాజకీయవ్యవహారకార్యములవలన మానభంగము, దేహజాడ్యము - ఇవి కలుగును. తక్కినరాసులు సమఫలములు.

### పుష్యమి

పుష్యమి నక్షత్రములోఁ పుట్టినవానికి శని వృషభములో తిరుగుతున్నప్పుడు కళత్రమూలకముగ, స్త్రీలమూలకముగ భార్యాదృష్టమువలనను ధనప్రాప్తి, శుభకార్యములవలన ఉల్లాసము, సింహకన్యలలో తిరుగునప్పుడు జీవనహాని, లోవైనములోనుండు పొత్తులనాశము. మీనములో సంచరించునప్పుడు తిలసంబంధకర్మ, బంధునాశము, ఋణసంకటము,క్రూరకార్యములు - ఇవి కలుగును. తక్కినరాసులు సమఫలములు.

### ఆశ్రేష

ఆశ్లేష నక్షత్రములోఁ పుట్టినవానికి శని మీనరాశిలో తిరుగునప్పుడు జీవనదుల వద్ద సుఖజీవనము, తన్మూలకముగ ధనలాభము, దేవీసంబంధములైన కార్యములు మీనకర్కటములలో తిరుగునప్పుడు జీవనహాని, పరదేశములో విశేషసంచారము, దేహఅసౌఖ్యము. ధనుర్మకరములలో సంచరించునప్పుడు విశేషముగ కర్మములు చేయుట, ఋణవిశేషము, వ్యాకులత్వము,జలమువలన భీతి, దారిద్ర్యము - ఇవి కలుగును. తక్కినరాసులు సమఫలములు.

### మఘ

మఘ నక్షత్రములోఁ పుట్టినవానికి శని ధనుర్మకరములలో సంచరించునప్పుడు బ్రాహ్మణమూలకముగ నీచులమూలకముగ ఉద్యోగమూలకముగ ధనలాభము, సంతోషము. తులా వృశ్చికములలో సంచరించునప్పుడు ఋణవ్యాకులము, తిలసంబంధకర్మము,శత్రుత్వము, మహాక్రూరతయు. మేషములో తిరుగునప్పుడు జీవనము లేకపోవుట,మానహాని, మహాదారిద్ర్యము - ఇవి కలుగును. తక్కినరాసులు సమఫలములు.

### పుబ్బ

పుబ్బా నక్షత్రములోఁ బుట్టినవానికి శని తులావృశ్చికములలో తిరుగునప్పుడు ప్రభుమూలకముగ స్త్రీలమూలకముగ మంచి ఉద్యోగశిఫారసులవలనను, ధనలాభము. సింహకన్యలలో తిరుగునప్పుడు ఋణమూలకముగ తిలసంబంధమగు కర్మమూలకముగ వ్యాకులము. మిథునములో నుండునప్పుడు బంధునాశము. కుంభములో నుండఁగా జీవనములేక లోవైనము భాగ్యముకూడా తొలఁగి దారిద్ర్యము

కలుగును. తక్కినరాసులు సమఫలములు. ఇదిగాక పైనంజెప్పిన స్థానములలో శనియుండిన శనిదశాభుక్తులు వచ్చిన ఈ ఫలములు తప్పక జరుగును.

### ఉత్తరా

ఉత్తరా నక్షత్రములోఁ పుట్టినవానికి శని వృషభములో తిరుగునప్పుడు చతుష్పాదజీవవశముగ, వృక్షమూలకముగ, మంచి ధనలాభము కలుగును. మిథునకటకములలో తిరుగునప్పుడు బంధుసంకటము, కర్మము, ఋణము, ధనుస్సులో తిరుగునప్పుడు జీవననాశము, హీనజీవనము కలుగును. తక్కినరాసులు సమఫలము.

### హస్తా

హస్తా నక్షత్రములోఁ పుట్టినవానికి శని మిథునములో తిరుగునప్పుడు వర్తకమూలకముగ, వైశ్య శూద్ర మూలకముగ మంచిఉద్యోగలాభము, సర్వకార్యజయము. కన్యా తులలో తిరుగునప్పుడు జీవనహాని, సొత్తులుకుదువ,స్త్రీమూలకముగ ప్రాణసంకటము, బుద్ధినాశము,స్థానభ్రంశము. మేషములలో తిరుగునప్పుడు ఋణబాధ, బంధునాశము,తిలసంబంధకర్మ, మనోవ్యాకులత్వము - ఇవి కలుగును. తక్కినరాసులు సమఫలములు.

### చిత్తా

చిత్తా నక్షత్రములోఁ పుట్టినవానికి శని మేషములో తిరుగునప్పుడు ప్రభువుల వాక్సహాయము బొంది భూములలోను, అరణ్యములలోను, కొండలసమీపములలోను లాభము, ఉద్యోగము, సంతోషము, కటకములో తిరుగునప్పుడు జీవనహాని, క్రూరజీవనము. మకర కుంభములలో దాయాది నాశము, ఋణబాధ,పైతృకకర్మ - ఇవి జరుగును. తక్కినరాసులు సమఫలములు.

### స్వాతి

స్వాతి నక్షత్రములోఁ పుట్టినవానికి శని మకరకుంభములలో నుండెనేని జీవనదీ సమీపమున నీచులమూలకముగ శూద్రులమూలకముగ ఉద్యోగమూలకముగ మంచి జీవనము. వృశ్చికములో తిరుగునప్పుడు ఋణబాధ, వ్యాకులము, బంధునాశము. కుంభములో సంచరించునప్పుడు బుద్ధివినాశము, చతుష్పాదజీవముల నాశము. ధనుస్సులో సంచరించునప్పుడు పైతృకకర్మ ఇవి కలుగును. తక్కినరాసులు సమఫలములు.

### విశాఖ

విశాఖనక్షత్రమునఁ పుట్టినవానికి శని వృశ్చికములోనికి వచ్చునప్పుడు ప్రభువుల సహాయమువలన ఎఱ్ఱని భూములుగల స్థానములవలన, ఉద్యోగమువలన లాభము. కన్యా తులలో నుండునప్పుడు ద్రవ్యంనష్టమయిపోవుట,పైతృకకర్మ, మీనములో నుండునప్పుడు జలగండము, సత్కర్మమూలకముగ విశేషద్రవ్యహాని - ఇవి కలుగును. తక్కినరాసులు సమఫలములు.

## అనూరాధ

అనూరాధ నక్షత్రములోఁ పుట్టినవానికి శని మకరములో సంచరించునప్పుడు జలసమీపమున మంచి జీవనము, అందువలన ధనలాభము. ధనుస్సులో తిరుగునప్పుడు జీవనహాని మహాకష్టము. కటకములో సంచరించునప్పుడు జలగండము. వ్యవహారస్థానములో మానభంగము, ఋణబాధ, బంధునాశము, కర్మ, శతృత్వము – ఇవి కలుగును. తక్కినరాసులు సమఫలములు.

## జ్యేష్ఠ

జ్యేష్ఠా నక్షత్రములోఁ పుట్టినవానికి శని కటకములో సంచరించునప్పుడు పరిపూర్ణ జీవనదీతీరమందు వ్యవహారమూలకముగ మంచిధనలాభము. మేషవృషభములలో తిరుగునప్పుడు కర్మ, బంధునాశము, ధనవ్యయము, వ్యాకులము,ఋణము,స్థానభ్రంశము, చతుష్పాదజీవములనాశము, తులా వృశ్చికములలో నుందునప్పుడు జీవనము దొరకకయుండుట, ఉన్నసొత్తులు కుదువలవలన నాశమగుట,స్త్రీలవలన మానభంగము – ఇవి కలుగును. తక్కినరాసులు సమఫలములు.

## మూల

మూలానక్షత్రములోఁ పుట్టినవానికి శని మేషవృషభములలో సంచరించునప్పుడు ప్రభువులవలనను చతుష్పాదజీవములవలనను భూములవలనను మంచిధనలాభములు, అధికారములవలన పరిపూర్ణసంతోషము, సింహములో నుందునప్పుడు జీవనము లేకపోవుటయు, లోవైనములోనుండు సొత్తులనాశము శత్రుత్వము కష్టమైన జరుగుబాటును, కుంభమీనములలో నుండెనేని దాయాదినాశము ఋణబాధవ్యాకులము – ఇవి కలుగును. తక్కినరాసులు సమఫలములు.

## పూర్వాషాఢ

పూర్వాషాఢ నక్షత్రములోఁ పుట్టినవానికి కుంభమీనములలో శని యుండెనేని దాసవర్గమువలన మంచిధనలాభము, వ్యవహారమువలన లాభము. మిథునములో సంచరించునప్పుడు చిక్కులెక్కల వలన వ్యాకులము, జీవనహాని, ధనుస్సులోనుందునప్పుడు కర్మ, ఋణము, వ్యసనము, బంధునాశము – ఇవి కలుగును. తక్కినరాసులు సమఫలములు.

## ఉత్తరాషాఢ

ఉత్తరాషాఢ నక్షత్రములో పుట్టినవానికి శని ధనుస్సులో సంచరించునప్పుడు బ్రాహ్మణమూలకముగ మంచిధనలాభము, వ్యవహారము. మేషములో సంచరించునప్పుడు దేహజాడ్యము, చేయుచున్న జీవనము నష్టమగుట, కష్టము, సొత్తుల నాశము, సింహములో సంచరించునప్పుడు దాయాదినాశము, తులావృశ్చికములలో సంచరించునప్పుడు ఋణము, వ్యాకులము కర్మ – ఇవి కలుగును. తక్కినరాసులు సమఫలములు.

### శ్రవణం

శ్రవణా నక్షత్రములోఁ పుట్టినవానికి శని తులారాశిలో సంచరించునప్పుడు ధనమూలకముగ విశేషధనలాభము,సింహమునందు సంచరించునప్పుడు కర్మము, ఋణము, వ్యాకులత్వము. మకర, కుంభములయందు సంచరించునప్పుడు జీవనహాని, దారిద్ర్యము - ఇవి కలుగును.

### ధనిష్ఠ

ధనిష్ఠా నక్షత్రములోఁ పుట్టినవానికి శని సింహములో సంచరించునపుడు రాజద్వారమున మంచి ధనలాభము వృషభమిథునములలో సంచరించునప్పుడు ఋణము మహావ్యాకులము దాయాదినష్టము కటకములో దిరుగునప్పుడు కర్మ, వృశ్చికములోఁ వున్నప్పుడు జీవనహాని రాజకీయదండనా వ్యవహారకార్యములయందు మానభంగము ఇవి కలుగును.

### శతభిషా

శతభిషా నక్షత్రములోఁ పుట్టినవానికి శని వృషభములో సంచరించునప్పుడు చతుష్పాద జీవములవలన మంచిధనలాభము, మేషము ప్రవేశించునప్పుడు కర్మము. కన్యలో సంచరించునప్పుడు జీవనహాని, దేశత్యాగము. మీనములోనుండునపుడు బంధునాశము ఋణమువలన వ్యాకులము - ఇవి కలుగును. తక్కినరాసులు సమఫలములు.

### పూర్వాభాద్ర

పూర్వాభాద్రా నక్షత్రములోఁ పుట్టినవారికి శని మీనములో సంచరించునప్పుడు దివ్యస్థలముందు జీవనదీప్రదేశములయందు మంచి ధనలాభమును, వ్యవహారమును కటకములో సంచరించునప్పుడు జలభీతి, లోవైనపు సొత్తులు, నష్టము, దేశత్యాగము, జీవనహాని మకరములోనుండునప్పుడు కర్మ ఋణవ్యాకులము - ఇవి కలుగును.

### ఉత్తరాభాద్ర

ఉత్తరాభాద్ర నక్షత్రములోఁ పుట్టినవానికి శని మకరములో సంచరించునప్పుడు నీచుల సహాయమువలన జలప్రదేశములయందు జలముమీద సంచరించెడు వస్తువులవలన (అనగా ఓడలవలన) మంచిధనలాభం మేషవృషభములలో సంచరించునప్పుడు జీవనములేక దేశమువిడిచి మరియొక దేశము ప్రవేశించుట, అక్కడను కష్టము, మీనములోఁ వున్నప్పుడు బంధు దాయాదినాశము. వృశ్చికములో నుండునప్పుడు కర్మచేయుట, ఋణవ్యాకులము - ఇవి కలుగును.

### రేవతి

రేవతీ నక్షత్రములోఁ పుట్టినవానికి శని వృశ్చికములో సంచరించునప్పుడు అధికారువలనను, రాళ్ళవలనను మంచి ధనలాభము. కుంభమీనమలలో సంచరించునప్పుడు జీవనహాని కష్టము. కన్యయందు సంచరించునప్పుడు కర్మచేయుట. సింహమునందు సంచరించునప్పుడు ఋణము, దాయాదినాశము - ఇవి కలుగును. తక్కినరాసులు సమఫలములు.

# అష్టకవర్గు

ఇది ఒక విభిన్నమయిన పరిశీలనాధ్యాయము. రాశి చక్రం ఆధారం చేసుకొని ఈ క్రింద యివ్వబడిన స్థానములలో బిందువులను వుంచి ఆ ద్వారా గణితం చేయగా వచ్చిన వాటిని ఆధారం చేసుకొని ఫలిత నిర్ణయం చేయడం. నేను ఈ బిందువులు బృహజ్జాతకం ఆధారంగా ఇస్తున్నాను. అయితే వరాహమిహిరుల వారు త్రికోణశోధన, ఏకాధిపత్యశోధన వంటివి ఇవ్వలేదు. బృహజ్జాతకం, లఘుజాతకంలలో అష్టకవర్గుల మీద ఫలితాధ్యాయము చాలా సూక్ష్మముగా చెప్పబడినది.

**రవ్యష్టక వర్గు**

| | | |
|---|---|---|
| కుజ, శని, రవి వున్న స్థానం లగాయితు | - | 1,2,4,7,8,9,10,11 |
| గురువు వున్న స్థానం లగాయితు | - | 5,6,9,11 |
| చంద్రుడు వున్న స్థానం లగాయితు | - | 3,6,10,11 |
| బుధుడు వున్న స్థానం లగాయితు | - | 3,5,6,9,10,11,12 |
| లగ్నం వున్న స్థానం లగాయితు | - | 3,4,6,10,11,12 |
| శుక్రుడు వున్న స్థానం లగాయితు | - | 6,7,12 |
| **మొత్తం** | - | **48** |

**చంద్రాష్టక వర్గు**

| | | |
|---|---|---|
| లగ్నం వున్న రాశి లగాయితు | - | 3,6,10,11 |
| కుజుడు వున్న స్థానం లగాయితు | - | 2,3,5,6,9,10,11 |
| చంద్రుడు వున్న స్థానం లగాయితు | - | 1,3,6,7,10,11 |
| రవి వున్న స్థానం లగాయితు | - | 3,6,7,8,10,11 |
| శని వున్న స్థానం లగాయితు | - | 3,5,6,11 |
| బుధుడు వున్న స్థానం లగాయితు | - | 1,3,4,5,7,8,10,11 |
| గురుడు వున్న స్థానం లగాయితు | - | 1,4,7,8,10,11,12 |
| శుక్రుడు వున్న స్థానం లగాయితు | - | 3,4,5,7,9,10,11 |
| **మొత్తం** | - | **49** |

**కుజాష్టక వర్గు**

| | | |
|---|---|---|
| రవి వున్న స్థానం లగాయితు | - | 3,5,6,10,11 |
| లగ్నం వున్న స్థానం లగాయితు | - | 1,3,6,10,11 |

| | | |
|---|---|---|
| చంద్రుడు వున్న స్థానం లగాయితు | - | 3,6,11 |
| కుజుడు వున్న స్థానం లగాయితు | - | 1,2,4,7,8,10,11 |
| శని వున్న స్థానం లగాయితు | - | 1,4,7,8,9,10,11 |
| బుధుడు వున్న స్థానం లగాయితు | - | 3,5,6,11 |
| శుక్రుడు వున్న స్థానం లగాయితు | - | 6,8,11,12 |
| గురుడు వున్న స్థానం లగాయితు | - | 6,10,11,12 |
| మొత్తం | - | **39** |

**బుధాష్టక వర్గు**

| | | |
|---|---|---|
| శుక్రుడు వున్న స్థానం లగాయితు | - | 12,3,4,5,8,9,11 |
| కుజుడు, శని వున్న స్థానం లగాయితు | - | 1,2,4,7,8,9,10,11 |
| గురుడు వున్న స్థానం లగాయితు | - | 6,8,11,12 |
| రవి వున్న స్థానం లగాయితు | - | 5,6,9,11,12 |
| బుధుడు వున్న స్థానం లగాయితు | - | 1,3,5,6,9,10,11,12 |
| చంద్రుడు వున్న స్థానం లగాయితు | - | 2,4,6,8,10,11 |
| లగ్నం వున్న స్థానం లగాయితు | - | 1,2,4,6,8,10,11 |
| మొత్తం | - | **54** |

**గురు అష్టక వర్గు**

| | | |
|---|---|---|
| కుజుడు వున్న స్థానం లగాయితు | - | 1,2,4,7,8,10,11 |
| గురుడు వున్న స్థానం లగాయితు | - | 1,2,3,4,7,8,10,11 |
| రవి వున్న స్థానం లగాయితు | - | 1,2,3,4,7,8,9,10,11 |
| శుక్రుడు వున్న స్థానం లగాయితు | - | 2,5,6,9,10,11 |
| చంద్రుడు వున్న స్థానం లగాయితు | - | 2,5,7,9,11 |
| శని వున్న స్థానం లగాయితు | - | 3,5,6,12 |
| బుధుడు వున్న స్థానం లగాయితు | - | 1,2,4,5,6,9,10,11 |
| లగ్నం వున్న స్థానం లగాయితు | - | 1,2,4,5,6,7,9,10,11 |
| మొత్తం | - | **56** |

**శుక్ర అష్టక వర్గు**

| | | |
|---|---|---|
| లగ్నం వున్న స్థానం లగాయితు | - | 1,2,3,4,5,8,9,11 |

| | | |
|---|---|---|
| చంద్రుడు వున్న స్థానం లగాయితు | - | 1,2,3,4,5,8,9,11,12 |
| శుక్రుడు వున్న స్థానం లగాయితు | - | 1,2,3,4,5,8,9,10,11 |
| శని వున్న స్థానం లగాయితు | - | 3,4,5,8,9,10,11 |
| రవి వున్న స్థానం లగాయితు | - | 8,11,12 |
| గురుడు వున్న స్థానం లగాయితు | - | 5,8,9,10,11 |
| బుధుడు వున్న స్థానం లగాయితు | - | 3,5,6,9,11 |
| కుజ వున్న స్థానం లగాయితు | - | 3,5,6,9,11,12 |
| **మొత్తం** | - | **52** |

**శని అష్టక వర్గు**

| | | |
|---|---|---|
| శని వున్న స్థానం లగాయితు | - | 3,5,6,11 |
| కుజుడు వున్న స్థానం లగాయితు | - | 3,5,6,10,11,12 |
| రవి వున్న స్థానం లగాయితు | - | 1,2,4,7,8,10,11 |
| లగ్నం వున్న స్థానం లగాయితు | - | 1,3,4,6,10,11 |
| బుధుడు వున్న స్థానం లగాయితు | - | 6,8,9,10,11,12 |
| చంద్రుడు వున్న స్థానం లగాయితు | - | 3,6,11 |
| శుక్రుడు వున్న స్థానం లగాయితు | - | 6,11,12 |
| గురుడు వున్న స్థానం లగాయితు | - | 5,6,11,12 |
| **మొత్తం** | - | **39** |

**ఉదాహరణ**

| | | | |
|---|---|---|---|
| కు | | | శ కే ల |
| చం | జన్మ రాశి చక్రము | | ర (బు) శు |
| గు | | | |
| రా | | | |

| | | | |
|---|---|---|---|
| 5 | 6 | 4 | 5 |
| 2 | రవ్యష్టక వర్గు | | 3 |
| 4 | | | 2 |
| 5 | 5 | 2 | 5 |

| 2 | 8 | 4 | 0 |
|---|---|---|---|
| 3 | చంద్రాష్టక | | 4 |
| 5 | వర్గు | | 5 |
| 4 | 7 | 4 | 3 |

| 3 | 5 | 3 | 5 |
|---|---|---|---|
| 2 | కుజాష్టక | | 1 |
| 2 | వర్గు | | 1 |
| 7 | 4 | 2 | 4 |

| 7 | 4 | 4 | 6 |
|---|---|---|---|
| 2 | బుధాష్టక | | 5 |
| 3 | వర్గు | | 2 |
| 6 | 7 | 2 | 6 |

| 7 | 6 | 4 | 3 |
|---|---|---|---|
| 3 | గురు అష్టక | | 4 |
| 3 | వర్గు | | 6 |
| 5 | 5 | 7 | 3 |

| 4 | 4 | 6 | 3 |
|---|---|---|---|
| 6 | శుక్ర అష్టక | | 3 |
| 4 | వర్గు | | 5 |
| 2 | 4 | 5 | 6 |

| 2 | 5 | 5 | 4 |
|---|---|---|---|
| 3 | శన్యష్టక | | 3 |
| 2 | వర్గు | | 4 |
| 5 | 3 | 2 | 1 |

| 30 | 38 | 30 | 26 |
|---|---|---|---|
| 21 | సర్వాష్టక | | 23 |
| 23 | వర్గు | | 25 |
| 34 | 35 | 24 | 28 |

# ప్రస్తారాష్టక వర్గు

| | మే | వృ | మి | క | సిం | కన్య | తు | వృ | ధ | మ | కుం | మీ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రవి | 6 | 4 | 5 | 3 | 2 | 5 | 2 | 5 | 5 | 4 | 2 | 5 |
| చంద్ర | 8 | 4 | 0 | 4 | 5 | 3 | 4 | 7 | 4 | 2 | 3 | 2 |
| కుజ | 5 | 3 | 5 | 1 | 1 | 4 | 2 | 4 | 7 | 2 | 2 | 3 |
| బుధ | 4 | 4 | 6 | 5 | 2 | 6 | 2 | 7 | 6 | 3 | 2 | 7 |
| గురు | 6 | 4 | 3 | 4 | 6 | 3 | 7 | 5 | 5 | 3 | 3 | 7 |
| శుక్ర | 4 | 6 | 3 | 3 | 5 | 3 | 5 | 4 | 2 | 4 | 6 | 4 |
| శని | 5 | 5 | 4 | 3 | 4 | 1 | 2 | 3 | 5 | 2 | 3 | 2 |
| సర్వ | 38 | 30 | 26 | 23 | 25 | 28 | 24 | 35 | 34 | 23 | 21 | 30 |

# త్రికోణశోధన

అధత్రికోణ శోధ్యేచ మేషసింహధనుః క్రమాత్

యిక్కడ త్రికోణములు అనగా

(ఎ) మేష,సింహ,ధనస్సులు

(బి) వృష,కన్య,మకరములు

(సి) మిధున,తుల,కుంభములు

(డి) కర్కాట,వృశ్చిక,మీనములు

1 త్రికోణ రాశులలో మూడిటిలో ఎందులో తక్కువ సంఖ్య వుంటే ఆసంఖ్యను మిగిలిన రెంటిలోనుండి తీసి వేయాలి.

**ఉదా –** మేషం5 సింహ 6 ధనస్సు 2 బిందువులు కలిగి వుంటే ధనస్సులో తక్కువ బిందువులు వున్నాయి కావున మేషం,సింహం, ధనస్సులు వున్న బిందువులలో రెండు తీసి వేయాలి.

2 ఈ త్రికోణంలో ఏదో ఒక రాశిలో సున్నా వుంటే కనుక ఏమీ తీయనవసరం లేదు. ఉదా మేషం 5 సింహ 5 ధనుః 0 అనుకోండి. త్రికోణశోధన తరువాత కూడా మేషం 5, సింహ 5, ధనుః 0 అవుతాయి.

3 రెండు త్రికోణములలో శూన్యసంఖ్య వున్నట్లయితే మూడవ కోణములోని అంకెను కూడా తీసి వేయ వలెను.

ఉదా - మేషం సింహంధనుః 5 శోధన తరువాత కూడా మేషం 0 సింహం 0 ధనుః0

4 మూడు త్రికోణములలో సమసంఖ్య ఉన్నట్లయితే శోధనానంతరం మొత్తం మూడుత్రికోణములు శూన్యమగును.

ఉదా :- మేషం 4 సింహం 4 ధనుస్సు 4

శోధన తరువాత మేషం 0 సింహం 0 ధనుస్సు 0

## ఏకాధిపత్య శోధన

" భ "చక్రంలో కర్కాటక సింహములకు తప్ప మిగిలిన వాటిలో ఒక్కొక్క గ్రహమునకు రెండురాశుల మీద అధిపత్యం ఉన్న కారణంగా ఈ ఏకాధిపత్య శోధన అవసర పడును. బిందుసంఖ్యలు పరస్పరం స్వల్పము, శూన్యము, సమత్వములను గుర్తించి - గ్రహరహిత గ్రహసహితములు ఆధారంగా ఈ శోధన చేయవలెను. త్రికోణాధిపత్య శోధన చేయబడిన అష్టకవర్గుకు మాత్రమే ఈ ఏకాధిపత్యశోధన చేయవలెను. ఏకాధిపత్యం వున్న రాశులు - మకర కుంభములు, మీన ధనస్సులు, మేష వృశ్చికములు , వృషభ తులలు, మిథున కన్యలు.

ఈ ఏకాధిపత్య రాశులలో రాశిచక్రంలో గ్రహము వున్న స్థానముకు (త్రికోణశోధన చేయబడిన అష్టకవర్గుకు ) సంబంధించి ఏకాధిపత్య శోధన చేస్తాము.

1 గ్రహములు లేని ఏకాధిపత్య రాశులలో (ఎ) బిందువులు సమానముగా వుండెనేని రెండింటినీ శూన్యం చేయాలి. (బి) వ్యత్యాస బిందువులు వుండెనేని తక్కువ బిందుసంఖ్యతో ఎక్కువ బిందుసంఖ్యను సమానం చేయాలి.

2 ఏకాధిపత్యరాశులలో గ్రహములు వున్న ఎడల (ఎ) రెండురాశులు గ్రహములతో కూడెనేని శోధన అవసరం లేదు. (బి) ఏకాధిపత్య రాశులలో గ్రహము వున్ననులేకున్నను - ఒకరాశిలో శూన్య బిందువు వుంటే ఆ రాశిలో శోధన అవసరం లేదు.

3 గ్రహములతో కూడిన ఏకాధిపత్య రాశులలో (ఎ) గ్రహములు వున్న రాశిబిందువులు అధికం అయిన తర్వాత రాశిబిందువులు అల్పమయినచో గ్రహరహిత రాశిబిందువులను శూన్యం చేయవలెను. (బి) గ్రహసహిత రాశిబిందువులు తక్కువ, గ్రహరహిత రాశిబిందువులు ఎక్కువ ఉన్న యెడల ఆ బిందువులను (రెండురాశులయందున్న వాటిని) సమానం చేయవలెను. (సి) రెండింటిలోను సమసంఖ్య బిందువులు వున్న యెడల రెండు రాశులలోనూ శూన్యం చేయవలెను.

## మండల శోధన

శోధనలకు ముందు వున్న సర్వాష్టక వర్గులో ఒక్కో రాశిలోని బిందుసంఖ్యను 12చేత భాగించగా వచ్చిన శేషమును మాత్రమే ఆ రాశిలో వుంచవలెను. అలా చేయగా వచ్చిన అష్టకవర్గుకు మరల త్రికోణశోధన, ఏకాధిపత్య శోధన చేయవలెను.

ఉదా :- సర్వాష్టకవర్గులో మేషములో 38 బిందువులు వున్నవి. దానిని 12చే భాగించగా శేషము 2. మండల శోధన చేసిన అష్టకవర్గులో మేషములో 2 బిందువులు వచ్చును.

## రాశిపిండగణితం

రాశిచక్రంలోని ప్రతిరాశికి ఒక్కో సంఖ్య నిర్దేశింపబడినది. అవి మేషాదిగా 7, 10, 8, 4, 10, 5, 7, 8, 9, 5, 11, 12. శోధనము చేసిన అష్టకవర్గులను గ్రహించి ప్రతిఅష్టకవర్గులోను అనగా రవి, చంద్ర, కుజ ఇలా ప్రతి అష్టకవర్గులోను ఆయా రాశులలో వున్న బిందువులను పైరాశి సంఖ్యలతో గుణించి వాటిని మొత్తం కూడగా వచ్చేది రాశిపిండచక్రము.

## గ్రహపిండ గణితం

రవికి 5, చంద్రునికి 5, కుజునికి 8, బుధునికి 5, గురువుకి 10, శుక్రునికి 7, శనికి 5, మొత్తము 7 గ్రహముల అష్టకవర్గులను రెండుశోధనలు పూర్తిచేసిన తరువాత ఒక్కో అష్టకవర్గుని గ్రహించి రాశి చక్రంలో గ్రహాలు ఏ రాశిలో వున్నవో ఆ రాశికి ఎన్ని బిందువులు ఉన్నవో ఆ బిందువులను పై సంఖ్యలతో గుణించగా వచ్చిన మొత్తము ఆ గ్రహము యొక్క గ్రహపిండము అవుతుంది.

శోధ్యపిండము = రాశిపిండ + గ్రహపిండ

## అష్టకవర్గ ఫలితాధ్యాయము

ఈ అష్టక వర్గులను అధ్యయనం చేయుటకు అనేక విధానాలు వున్నాయి. నేను ప్రధానంగా బృహత్పరాశరీహోరను ఆధారంగా చేసుకొని దానికి మిగిలిన గ్రంథాల యొక్క విషయాలను క్రోడీకరించి ఫలిత విషయాలను అందిస్తున్నాను. అయితే నా అనుభవంలో అష్టకవర్గు గోచారఫలిత అధ్యయనంలో మాత్రమే బాగా వుపయోగిస్తున్నది. వరాహ మిహిరులు అష్టక వర్గుని ఆధారంగా ఫలితములు తెలుపు విషయం విపులంగా చెప్పలేదు. జాతక పారిజాతం ,ఫలదీపికలలో వున్న విషయాలను కూడా యిక్కడ వివరిస్తాను. కేవలం అష్టకవర్గు ఆధారంగా ఫలితములు నిర్ణయించకుండా దశావిధానానికి కూడా ప్రాముఖ్యం యిచ్చుట శ్రేయస్కరము.

1(ఎ) రవి వున్న రాశికి తొమ్మిదవ రాశి పితృగృహము. ఆ రాశిలో రవ్యష్టక వర్గులో వున్న బిందువులను శోధ్య బిందువులతో గుణించి ఆ మొత్తమును 27చే భాగించగా శేష సంఖ్యను అశ్విన్యాది నక్షత్ర సంఖ్యగా గ్రహించి ., ఆ నక్షత్రములో శని గోచార వశమున సంచరించే కాలములో పితృసమానునికి గానీ తండ్రికి గానీ యిబ్బంది చెప్పవలెను.

1(బి) శన్యష్టక వర్గులోని శోధ్యపిండమును లగ్నాదష్టమ రాశి బిందువులచే గుణించి 27 చే భాగింపగా వచ్చే శేషసంఖ్య అశ్విన్యాదిగా గ్రహించి ఆ నక్షత్రమున గోచారవశమున గురు, శని ప్రవేశించినప్పుడు మారకం చెప్పవలెను.

2. చంద్రుని శోధ్య బిందువులు చంద్రాత్ చతుర్థ స్థానములోని బిందువులచే గుణించి (చంద్రాష్టక వర్గులోని) ఆ గుణించగా వచ్చిన మొత్తమును 27చే భాగించగా వచ్చిన శేషసంఖ్య అశ్విన్యాదిగా ఏ నక్షత్రం అగునో ఆ నక్షత్రరాశియందుగానీ ఆ నక్షత్రరాశికి నవమ పంచమ స్థానములయందు వుండు నక్షత్రరాశికి గానీ గోచారవశమున శని ప్రవేశించినప్పుడు మాతృదుఃఖము కలుగును.

3. ఈ మాదిరిగానే కుజాష్టక వర్గును కుజాష్టక వర్గులోని తృతీయ స్థానమును వాడుకొని సోదర విషయము విచారింపవలెను.

4. శని అష్టక వర్గును శన్యష్టక వర్గులోని అష్టమస్థానమును వాడుకొని ఆయుర్దాయ గణన చేయవలెను.

5. బుధాష్టక వర్గును చతుర్థస్థానమును (బుధాష్టక వర్గులోని) బంధు విషయము గణన చేయవలెను.

6. శుక్రాష్టక వర్గును వాడుకొని శుక్ర శోధ్య బిందువులను సప్తమభావ బిందువుల ఆధారంగా కళత్ర కష్టములను నిర్ణయించాలి.

7. శన్యష్టక వర్గులో లగ్నమునుండి శని వరకు గల శుభబిందువులను కూడి శనినుండి లగ్నము వరకు గల బిందువులను కూడి ఈ రెండింటి సంఖ్యల వయస్సుయందు జాతకునికి ప్రమాదసూచనలు చెప్పవలెను.

**జాతక పారిజాతంలో విశేషాలు.**

మేషాది రాశులయందు ఏ గ్రహము వలన 8 బిందువులు సంప్రాప్తమగునో ఆ భావము బలయుతమైనది. 5-6-7 బిందువులు శుభప్రదములు. 4 బిందువులు మిశ్రమ ఫలితములు యిచ్చును. అంతకన్నా తక్కువ బిందువులు నిర్వీర్యములు అగును.

ఏ గ్రహమునకు అది వున్న రాశికి

శూన్యబిందువులు శూన్యఫలము

ఒక బిందువు వున్న రోగములు, భయము కలుగును.

| | |
|---|---|
| రెండు బిందువులు వున్న | మనస్తాపము, చోరభయము, రాజభయము కలుగును. |
| మూడు బిందువులు వున్న | శరీరాయాసము, అధికతిరుగుడు తద్వారా శ్రమ. |
| నాలుగు బిందువులు వున్న | సుఖము కష్టము మిశ్రమముగా వుండును. ధనవ్యయములు సమము. |
| ఐదు బిందువులు వున్న | సద్వస్త్ర లాభము, సత్పురుష సమాగములు, విద్యా, ధనము కలుగును. |
| ఆరు బిందువులు వున్న | కార్యభయము, క్షేత్ర వాహనలాభం. |
| ఏడు బిందువులు వున్న | అశ్వ, సేనా, ధన లాభములు, ప్రాభవము, వైభవము పెరుగును. |
| ఎనిమిది బిందువులు వున్న | సత్సంతానము, రాజవైభవములు వుండును. |

**పాఠాంతరము** – పై ఫలితాముల విచారణలో ఏగ్రహ విషయమై పరిశోధన చేయుచున్నామో ఆ గ్రహము యొక్క కారకత్వములను బట్టి లాభఫలితములు, నష్టఫలితములు నిర్ధారించవలెను. అయిదు బిందువులు ఆ పై సంఖ్యలో బిందువులు వున్న రాశియందున్న గ్రహం స్వవర్గులయందున్న ఎడల సదా శుభప్రదమై వుండును. అలా కానిఎడల అనగా శతృవర్గుల యందున్న గ్రహం అధికబిందువులు కలిగిననూ నిరుపయోగమే.

షడ్వర్గ బలయుక్తమైన గ్రహం కేంద్ర లేదా కోణస్థితిలో వున్నప్పటికీ స్వల్పబిందు ప్రభావంచేత దుష్ఫలితములు యిచ్చును.

శూన్యబిందువులు వచ్చిన రాశియందు గోచారవశమున గ్రహములు ప్రవేశించినను ఆ గ్రహము యిచ్చు ఫలితము శూన్యముగానే వుండును.

స్వల్పబిందు ప్రభావము, రాశులయందు బలహీనమయిన గ్రహప్రభావము వలన ఆ గ్రహము ప్రభావము చెడుగానే వుండును.

రవ్యాది శనిపర్యంతము వున్న అష్టకవర్గులలో ఏ రాశియందు శూన్యబిందువులు వుండునో ఆ రాశియందు గోచారవశమున శని ప్రవేశించినపుడు ఆయాగ్రహ ఆధిపత్య భావములకు కష్టములు కలుగును. ఉదాహరణకు చంద్రాష్టకవర్గులో చంద్రునికి శూన్యబిందువులు వచ్చిన రాశిలో గోచారమున శని వచ్చినపుడు ఆ చంద్రునికి రాశిచక్రంలో ఏ భావములు వున్నవో ఆ భావములు చెడును.

గోచార ఫలితాధ్యాయములో చెప్పిన ప్రకారం ఫలితం అధ్యయనం చేసి ఆ ఫలితములు అష్టకవర్గ ద్వారా నిర్ణయించాలి. గోచారంలో మంచి ఫలితములు చెప్పబడిన రాశులలో గ్రహము సంచరించునపుడు ఆ రాశులలో ఆ గ్రహముకు స్వల్పబిందువులు వచ్చినచో ఫలితము తక్కువగానే

చెప్పాలి. బిందువులు అధికం అయినచో ఫలితం ఎక్కువని చెప్పాలి. గ్రహం చెడుఫలితాలు యివ్వవలసిన రాశులలో సంచరించునప్పుడు ఆ రాశులలో ఎక్కువ బిందువులు వున్నట్లయితే చెడుఫలితాలు తగ్గుతాయి.

ఉదాహరణకి మేషరాశివారికి శని తృతీయంలో గోచారంలో సంచారం చేయాలి. వారి జాతకంలో శన్యష్టకవర్గులో మిథునంలో నాలుగులోపు బిందువులు వుంటే శని తక్కువగా యోగిస్తారు. నాలుగుకంటే ఎక్కువ బిందువులుంటే ఎక్కువగా యోగిస్తారు. గోచార ఫలితం విషయంలో సామాన్య నియమం అయితే శని తృతీయంలో సంచారం చేస్తున్నప్పుడు ఎక్కువ శుభఫలితాలు యివ్వాలి.

సర్వాష్టక వర్గులలో 28 బిందువులకంటే తక్కువ బిందువులు వున్న రాశులలో గోచారవశమున సంచరించు గ్రహములు సానుకూలం లేని ఫలితములను 28 నుండి పై సంఖ్యలో బిందువులు వున్న రాశులలో గోచారంలో గ్రహములు సంచరించునప్పుడు సానుకూల ఫలితములను యిచ్చును.

ఫలాధికం భృగోర్యత్ర తత్ర భార్యా జనిర్యది

అస్యాం వంశాభివృద్ధిః స్యాదల్పేక్షీణార్థ సంతతిః

శుక్రునికి ఏ రాశిలో ఎక్కువ శుభబిందువులున్నవో ఆ శుభబిందువులు వున్న దిశలో జననం అయిన కన్యను వివాహమాడిన విశేష సంతతి ప్రదము. అల్పబిందువులు వున్న రాశి దిశలో జననం అయిన కన్యతో వివాహం స్వల్ప ధన సంతతి యోగమును సూచించును

| సూచన :- ఛప్పన్నము, జినేంద్రమాల, తాచకనీలకంఠీయము, దైవజ్ఞవల్లభము, ఇత్యాది అనేక గ్రంథముల ఆధారముతో బృహత్పరాశరీ హోరలోని ప్రశ్నభాగమును తీసుకొని పూర్తి వివరణలతో త్వరలో గ్రహచార దర్పణము రెండవభాగము విడుదల చేయనున్నాను. |
|---|

.....శ్రీ లక్ష్మీ నృసింహార్పణమస్తు.....

## ఇతర రచనలు

### వాస్తుసుధ

సమగ్రవాస్తు పరిశీలనా గ్రంథము

### ముహూర్త సుధ

సంపూర్ణ ముహూర్త, ధర్మశాస్త్ర విషయ పరిశీలనా గ్రంథము

### భారత్-చైనా వాస్తు విజ్ఞానము

ఫెంగ్‌షుయి విమర్శనా గ్రంథము

### భవిష్యత్ రచన

గ్రహచార దర్పణము రెండవ భాగం (సంపూర్ణప్రశ్నావిధానము)

ప్రతిసంవత్సరము సూర్యసిద్ధాంత పంచాగము రచయితచే ప్రచురింపబడును

ప్రతులకు :

**శ్రీ శివకామేశ్వరి గ్రంథమాల**

41-22-4-36, భ్రమరాంబపురం, కృష్ణలంక,

విజయవాడ - 520 013. ఫోన్ : 2522824.

